

బోంబే డయింగ్
దుస్తుల్లోని అందగాడు
కళ్ళముందర కొస్తాడు
తియ్యటి తలపుల్ని
రేపుతూ
బోంబే డయింగ్ మొగవాళ్ళ దుస్తులు. అద్భుతమైన శ్రేణిలోని పాలియెస్టర్ షర్టింగులు 50/50, 67/33, 80/20 మరియు 100% పాలియస్టర్ ప్రింట్లు. పాలియస్టర్ డెనిమ్స్, యింకా టెక్స్చరైజ్‌డ్ సూటింగులు.
కాటిలాన్ పాలియస్టర్ షర్టింగు వాట్రీన్ పాలియస్టర్ సూటింగు
బోంబే డయింగ్
U BDM-29-76 Tel

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 31–12–'76
నల నామ సం. పుష్య శు. దశమి
*సంపుటము 70 : సంచిక : 18*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60
" ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

కథలు :



*సీరియల్ కథలు :*



*వ్యాసాలు, శీర్షికలు :*

## ఉత్తరాలు

### క్రీడాభంగం? ఎన్నాళ్లు?

19-11-76 వారం 'సామాన్యుని సణుగుడు' — మనరాష్ట్రం ఆటలలో అంత అభివృద్ధి చెందలేదనే విషయం అందరికి తెలిసినదే. మన విద్యారంగం అభివృద్ధిపైనే క్రీడారంగం ఆధారపడివుంది. కడుపునిండా తిండి, చదువుకోడానికి సరియైన అవకాశాలు వున్నప్పుడే క్రీడలపై విద్యార్థులు మొగ్గుచూపే అవకాశం వుంటుంది.

విద్యార్థులకు కావలసిన పాఠ్య పుస్తకాలు, ఇతర స్టేషనరీ లభించేసరికే విద్యా సంవత్సరంలో సగభాగం జరిగిపోతుంది. మిగతా సగభాగం పరీక్షలకై 'బట్టీయం' చేయడానికే సరిపోయే ఈ రోజుల్లో విద్యార్థులకు క్రీడలపై ఆసక్తి పెరగడం అన్నది నీటిమూటలాంటిది.

మన రాష్ట్రంలో వున్న పాఠశాలలకు ఏ ఒక్కదానికి కూడ దాని అవసరాలు తీర్చగల భవనం కాని, ఆటస్థలంకాని లేదు. ఇప్పుడున్న స్కూళ్లలో ఎక్కువభాగం అద్దె గృహాల్లో వుండడంద్వారా ఆ స్కూల్‌కు తగిన ఆటస్థలం సంపాదించడంలో అధికారులు తమ అశక్తతను వెల్లడిస్తున్నారు. ప్రాథమిక పాఠశాలల గురించి ఆలోచించాల్సిన పనిలేదు

పదిశాతం ప్రాథమిక పాఠశాలల్లో కనీసం కోకో ఆట కూడ ఆడించడంలేదు ఒకేసారి కళాశాలలో ప్రవేశించి జాతీయ ఆటగాణ్ణి కావాలనుకొనేవారు, తమ కళాశాలనుండి జాతీయ క్రీడాకారులను తయారు చేయాలని ఆశించే ఫిజికల్ డైరెక్టర్స్ తమ ఆశయాలను ఆశయాలుగానే వుంచుకొంటున్నారు

భారతదేశంలోని ప్రతిప్రాథమిక విద్యాలయానికి ఒక ఆట స్థలం ఏర్పరచి, ప్రతిరోజు విద్యార్థులను ఏదో ఒక ఆట ఆడించుచుండిన, పెరిగి పెద్దవారైన కొలదివారిలో వుత్సాహం, అభిరుచి పెరిగి గొప్ప క్రీడాకారులయ్యే అవకాశంవుంది.

ప్రభుత్వం క్రీడారంగంపై చేస్తున్న అనేక కోట్ల రూపాయల వ్యయం పూర్తి ఫలితాన్ని ఇవ్వలేకపోవడానికి కారణం క్రీడావ్యవస్థ నిర్మాణంలోనే వుంది జాతీయ స్పోర్ట్స్ కవున్సిల్ నిర్మాణాన్ని పునర్నిర్మించితే భారత క్రీడారంగం ప్రపంచ క్రీడారంగంలో ఒక వున్నతస్థానం అందుకొనే అవకాశం వుంది

ప్రజలలో ఆటల అభిరుచి పెరగడానికి విద్యార్థులలో ఆటల అభిరుచి పెరగడానికి ప్రతిగ్రామంలో ప్రతినెలకొకసారైన ఆటల పోటీలను ఏర్పాటు చేస్తుంటే అభివృద్ధికి చక్కని పరిస్థితులు ఏర్పడగలవు

సి. హెచ్. వి. ప్రభాకర్‌రావు, పత్రికా పాఠకుల సంఘం జగిత్యాల).

## లోకం పోకడ — ఉమేశ్



## హైదరాబాద్ నోట్‌బుక్

19.11.76వ తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రిక లోని హైదరాబాద్ నోట్‌బుక్‌లో శ్రీ తిరుమల రామచంద్రగారు "శ్రీ విశ్వనాథ నిర్యాణానికి గవర్నర్ సంతాపము" అనే శీర్షిక క్రింద అక్టోబరు నెల 18 తేదీన విజయవాడలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు మరణించినట్లు తెలిపారు. కానీ విశ్వనాథగారు అక్టోబరు 18వ తేదీ గుంటూరులోని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలో మరణించారు కదా! తిరుమల రామచంద్రగారు గమనించ ప్రార్థన

కె. ఎస్. ఎస్. ప్రసాదరెడ్డి, (గుల్లదూర్తి)

## ఎంతకాలం...

తెలుగులో ప్రయోజనాత్మక చిత్రాలు రావటం లేదని అందరూ అభిప్రాయ పడుతున్న తరుణంలో 'నటసామ్రాట్ చక్రవర్తి' ఎవరు అని ఆంధ్రపత్రిక పాఠకులు చేస్తున్న వాదోపవాదాలు చూస్తే నవ్వాలో ఏడవాలో తెలియటం లేదు. అసలు ఈ వివాదం చూస్తేనే మన తెలుగు ప్రేక్షక లోకం ఏ దశలో వుందో తెలుస్తోంది. మన నలుగురు పెద్ద హీరోలు ప్రస్తుతం ప్రయోజనాత్మక చిత్రాలు రావటానికి ఎటువంటి కృషి చెయ్యటం లేదని నా అభిప్రాయం. ప్రస్తుతం వారి చిత్రాల్లో వారి 'ఇగో' ప్రభావం బాగా కన్పిస్తోంది. ఎప్పుడు నటుడి యొక్క విలువ

# ఉత్తరాలు

వసూళ్లను బట్టి కాక నటనాసామర్థ్యం గీటురాయిగా భావించి నిర్ణయిస్తారో అప్పటివరకు మనకు విముక్తి లేదు. మన ప్రేక్షకుల్లో ఈ స్టార్ కాంప్లెక్స్ డెవలప్ కావటానికి ఎంతకాలం పడుతుందో!.

శివప్రసాద్, (విజయవాడ.)

## అట్టమీదబొమ్మ

ఈ వారం పద్మప్రియ ముఖచిత్రంతో వెలువడిన మనపత్రిక చాలా ఆకర్షణీయంగా యుంది. శ్రీనివాస్‌గారి సినిమా కబుర్లు చాల ఆసక్తిగా వున్నాయి. డాక్టర్ వనిత సీరియల్ మంచి కథా బలంతో సాగుతుంది. వీరాజీగారి నీహారిక్యుని సణుగుడు చాలాసహజంగా ఉంది

మురమళ్ల వరప్రసాదరావు, అపికొండ నాగమణి, మురమళ్ల సాంబమూర్తి. (చోడవరము)

## సీరియల్

పద్మప్రియ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక పదవపేజీలో వేసిన "శశిధర్" జోక్ చూచి నవ్వొచ్చింది, ఎందుకో తెలుసా? అదే జోక్ నవంబర్ సంచిక మరో వార పత్రికలో ప్రచురింప బడినది. "డాక్టర్ వనిత" సీరియల్ ఇంటరెస్టుగా నడుస్తుంది. కథలు నాలుగు ఒకేలాగున్నాయి

డి.ఉదయకుమార్, బి.ఏ. [కాశీబుగ్గ] మరియు కవులు గంగా మోహన్ ఆర్ మనోహర్, ప్రేమ్ సింగ్ (ఆరమూర్)

## కొబ్బరి బిస్కట్‌లు ఎలా అవుతాయి?

10-12-76 నాటి పత్రికలో శ్రీమతి కె.మాణిక్యేశ్వరి హైదరాబాద్ నుండి వ్రాశారు. కొబ్బరి కోరును ఎక్కడ ఎప్పుడు ఉపయోగించాలని! జల్లించిన మైదాలో పాలు, నెయ్యి, కొబ్బరికోరు పంచదార, సోడా వేసి పూరీ పిండిలా తడుపుకోవాలండి.

మానుపాటి జమునారాణి (మహబూబునగర్)

## కథలు

ఈవారం (22—10—76) పత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. కథలలో రెండు కథలు బాగున్నవి. సీరియల్ కథలలో "డాక్టర్ వనిత" కథ చాల ఆసక్తికరంగా ఉంటుంది. సినిమా శీర్షికలో. శ్రీనివాస్‌గారు అందరి నటులకు గిటార్ వాయించారు... రామలక్ష్మిగారి జవాబులు చాల కారంగా ఉన్నవి...ఏమైనా పత్రిక... చిత్రజగత్తులో చెరగని, తరగని చంద్రుడు. ఎన్నితారలు వచ్చినా చెక్కు చెదరదు.

యస్. వర్వేశ్వరరావు, (ముమ్మిడివరం)

(49 వ పేజీ చూడండి)

# సప్పెటిక్.

గోవిందరాజు సీతాదేవి



రేడియోలో యెల్లారీశ్వరి పాట వింటూ పరవశురాలై పడకకుర్చీలో కూర్చున్న శ్యామలకి తలుపు టిక్ టిక్‌మని యెవరో కొడుతూన్న శబ్దం యిప్పటికి విన్పించింది. రేడియో కాస్త తగ్గించి వెళ్ళి తలుపు తెరిచింది. యెదురుగా యిరవైయేళ్ళ అమ్మాయి నిల్చుంది.

"కాస్త యీవాళ పేపరు యిస్తారా" అని అడుగుతూన్న అమ్మాయిని కిందనుంచి పైకి పరీక్షగా చూసింది. తెల్లగా సన్నగా పొడుగ్గా వుంది. గుండ్రటి ముఖం పెద్ద కళ్ళూ నొక్కులజుట్టు పొట్టి జడా, నీలం చుక్కలున్న వాయిల్ చీరమీద అదేరంగు జాకెట్ వేసుకుంది. మెడలో సన్నటి గొలుసులో మంగళసూత్రాలు పైట చాటునుంచి మెరుస్తూన్నాయి. చేతులకి ఒక్క జత బంగారు గాజూ ఆ గాజుకి యిటూ అటూ ఓ మట్టిగాజూ వుంది. ముఖాన దోసగింజంత బొట్టువుంది.

యిదీ ఆ అమ్మాయి రూపం. ఎవరీ కొత్త అమ్మాయి అనుకుంటూ అడిగింది శ్యామల "మీ పేరేమిటి!" అని.

"అమల"

"విమలా"

"కాదు! అమల"

"యీ పేరు తెలుగు వాళ్ళది కాదులా వుందే."

"నాకు తెలియదు."

"ఏ వాటాలోకి వచ్చారు."

"అదిగో యెదురుగా వున్న నన్నజాజి పందిరి లేదూ ఆ వాటాలోకి. వారం అయింది వచ్చి."

"అలాగా. నే వూళ్లోలేను. కమలమ్మ వదినగారు ఖాళీ చేశారన్న మాట. యింతకీ మీ ఆయనకి ఏం వుద్యోగం ఏవూరినించి వచ్చారు. యెంత జీతం."

శ్యామల లోపలికి రమ్మని కుర్చీచూపించి తనూ కూర్చుంటూ అడిగింది.

అమల భర్త వుద్యోగం వివరాలు చెప్పింది కానీ జీతం విషయం మాత్రం 'నాకు తెలియదు' అంది;

యీ మాటకి శ్యామల పెద్దగా నవ్వింది. అమలకి కాస్త కోపం వచ్చింది.

"చూడూ మీ ఆయనగారి పేరేమిటి" యీ ప్రశ్నకి అమల విసుగ్గా ముఖం పెట్టి "కాస్త పేపరు యిస్తారా' అంది.

"పేపరెందుకూ."

'సినీమాలు ఏ హాల్లో ఏవి వున్నాయో చూడటానికి.'

"వంటరిగానే వెడతావా."

"కాదు"

"అదృష్టవంతులు వెళ్ళిరండి యిదుగో పేపరు. అన్నట్లు ఆ సినీమా యేదో కాస్త చూసివచ్చి కథ చెప్పండి."

"నాకు కథ చెప్పటం రాదే? అరె చాలా టైము అయింది. వస్తాను."

పేపరు పట్టుకుని ఎదురు వాటాలోకి వెళ్ళిపోయే అమలని చూస్తూ వుండిపోయింది శ్యామల కొత్తమ్మాయి తెలివిగలఘటంలానే వుంది. అందంగా కూడా వుంది.

యింతకీ యీ అమ్మాయి మొగుడెవరబ్బా! అతనెలా వుంటాడు! చక్కగా సినిమాకి వెడతారుట. మా ఆయనా వున్నాడు యెందుకు?

వినుగ్గా ముఖం పెట్టుకుని రేడియో పెట్టుకుని అలా నిద్రలోకి జారిపోయింది శ్యామల శ్యామలకి రెండేళ్ళయింది పెళ్ళిఅయి శ్రీనివాసమూర్తితో. శ్రీనివాసమూర్తిది కాస్త పెద్దవుద్యోగమే. కానీ పుట్టింటి ఆస్తితో వచ్చిన శ్యామలభర్తని తనగీచిన గీటు దాటనీయదు నిల్చోమంటే నిల్చోవాలి కూర్చోమంటే కూర్చోవాలి ఆ వ్యవహారిలో చిన్న చిన్న వాటాలు పదివరకూ వున్నాయి. అవన్నీరెండేసి గదులే. అయినా శ్యామలవున్న వాటాకి మరో చిన్నగదండా యెక్కువవుంది. కనుక తను అద్దెయెక్కువ యిస్తున్నాను. అంటూ మిగతా కాపురాల వారిమీద అధారిటీ చెలాయిస్తూ వుంటుంది. యీ యింటియజమాని ప్రతినెలా మూడోతారీకు వాడు మాత్రం వచ్చి అద్దెలు చేసుకువెళ్ళి మళ్ళీ నెలకిగానీ కన్పించడు.

**2**

అమల పేపరుభర్తకి యిచ్చి 'టీ' చేసేందుకు వంటగదిలోకి వెళ్ళింది మురళీమోహన్ సినిమాలపేర్లు చూస్తూ.

"అమలా త్వరగా రెడీకావాలి! ముందు అర్జెంట్‌గా టీ యివ్వు. లండన్‌కి వెళ్ళి రావాలి"

"యిదిగో" అయిదునిమిషాల్లో టీ కప్పు తెచ్చి యిచ్చింది.

"యింత త్వరగా రెడీ అయిపోయిందా టీ!

# పప్పెట్

సరేగానీ చూడూ ఏ సినిమాకి పోదాం"

"మీ యిష్టం" కుర్చీలాక్కుని కూర్చుని టీ తాగుతూ అంది అమల.

"చూడమ్మాయ్ యీ దేశంలో మగాడనే వాడు మంచివాడుకాడు. నీవిలా అన్నింటికీ డూ డూ బసవన్నా అన్నావంటే ఆపైన నీ యిష్టం నేవినేందుకు కష్టం"

"అంటే ?"

"ట్యూబులైటూ అర్థంకాలేదూ ! చేతులారా మగాడిని చెడగొట్టటం అని అర్థం"

"ఔనా! అయితే వుండండి. నాయిష్టమైనది చూస్తాను,"

అంటూ పేపర్లోకి చూస్తూ టక్కున ఆగి భర్త ముఖంలోకి చూస్తూ "యింతకీ అసలు సంగతి పసికట్టేశాను. మీరి సినిమాలన్నీ చూసేసినవే కదూ!"

"అహ. చూడనివి చాలా వున్నాయి" తంగారుగా అన్నాడు.

"లేవు" ఖచ్చితంగా అంది ఖాళీ కప్పు లందుకుంటూ.

"నీ కెలా తెల్సు."

"ప్రశ్నకి ప్రశ్న జవాబు కాదు! నాకు జవాబు చెప్పండి."

"కా...దు"

"అబద్దం" అంటూ ఓ పాత డైరీ తెచ్చి అతని ముందు పడేసింది. మురళి తనూ చూసిన సినీమాల పేర్లూ ఎన్నెన్ని సార్లు చూసింది వివరాలు రాసివున్న డైరీ అది.

"ఇప్పుడు చెప్పండి" అంది కోపంగా. మురళి మనస్సులో అనుకున్నాడు అయ్యయ్యో కాపురానికి వచ్చి వారం కాలేదు అప్పుడే యిన్ని ఆరాకీలు లాగేసిందా! బాబోయ్ మరో డైరీ వుండాలి దానిలో కొన్ని వుత్తరాలుండాలి అవన్నీ అమల చూడకుండా దాచుకోవాలి చూసే కొంపలు అంటుకుంటాయి అనుకుంటూ ముఖం కడుక్కోనేందుకు లేచాడు.

"దేనీ నీ మాట వేదవాక్యం అన్నాగా. పద పోదాం"

"అలా దారిలోకి రండి" తనూ ముస్తాబు అవుతోంది అమల.

స్నేహితుడి స్కూటర్ యెరువు తెచ్చుకుని కొత్త భార్యని వెంట తీసుకుని పాత హిందీ సినిమా చూ వచ్చాడు మురళి "అబ్బ! నలుపూ తెలుపూ సినిమాలు చూడటం కష్టం స్టోరీ ఎంత బాగున్నా" వాలు కుర్చీలో వా

"అమలా! కాస్త వేడి టీ యివ్వు."

అంటూండగానే పొగలు వస్తున్న టీ కప్పు తెచ్చి అందిచ్చింది అమల మురళి టీ తాగుతూ "అబ్బ! టీ బాగుందోయ్! అదిసరే ఆకలి కరకర మంటోంది యింతకీ రాత్రికి కూరలేమిటి" అడిగాడు.

"అప్పడాలు వేయిస్తాను వూరగాయా సాంబారూ వుంది బస్ అంతే."

"అబ్బ! కాస్త కందిపప్పు యెర్రగా

---

# వారఫలం
## మహేష్

**31–12 1976 శుక్రవారం మొదలు**
**6–1–1977 గురువారం వరకు**

**మేషం:–** మీ శ్రమకు తగిన ఫలిత లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు అందుతుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు స్త్రీలకు– కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి విలాసవస్తువులు కొంటారు.

**వృషభం:** ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ప్రయోజనకరమైన పరిచయాలు ఏర్పడతాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:–** ఫలితంలేని శ్రమ కలుగుతుంది. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం ఆఖరులో నూతన వ్యవహారాలు బాగుంటాయి మీ పట్టుదల ఫలిస్తాయి స్త్రీలకు– కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది.

**కర్కాటకం.** [illegible] వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహస వ్యవహారాలు బాగుంటాయి వారం ఆఖరులో ప్రయాణానికి గురి కాగలరు. లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం –** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది ప్రయోజనకర పరిచయాలు యేర్పడతాయి సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. స్త్రీలకు — దైవ కార్యాలు నెరవేరతాయి. అలంకార వస్తువులు కొంటారు.

**కన్య:—** నూతన వ్యవహారాలు లాభిస్తాయి మిత్రులకు సహాయం చేస్తారు. రావలసిన డబ్బు అందుతుంది. అధికారుల వలన జరిగి

వేయించి వెలులిపాయవేసి చట్నీ రుబ్బి అందులోకి వంకాయ పులుసు పచ్చడి చేస్తే అమోఘంగా వుంటుంది. అది కాస్త చేయ రాదూ."

"చూడండి మీ కోరికలన్నీ ఓ లిస్ట్ రాసి బల్లపైన పెట్టండి. తాపీగా రేపొద్దున చూస్తాను. వీలుంటే అన్నీ చేసేస్తాను బస్ అంతే!" అంటూ అమల లేచింది.

"యిదిగో నా వంట అయేవరకూ మీరా పుస్తకాలు చదువుకుంటూ కూర్చోండి. అర్ధ గంటలో కేకేస్తాను. సరేనా."

"అబ్బ. అసలే తలనొప్పిలో చస్తుంటే యిప్పుడేం చదువు"

"అందుకే రెండు గంటల చదువుని అర్ధ గంటకి తగ్గించాను" అంటూ అల్మారాలోని పుస్తకాలు తెచ్చిపెట్టి తలుపు దగ్గరకి లాగి వెళ్ళిపోయింది.

మురళీమోహన్ 'హూ' అనుకుంటూ పుస్తకం తెరిచాడు.

## 3

బికాం పాసై ఉద్యోగం చేసుకుంటూ నైట్ కాలేజీలో 'లా' చదివి ఫైనలియర్‌కి వచ్చి అబ్బ వెధవ చదువు అనీ వదిలిపెట్టే యాలనుకుంటూన్న మురళీమోహన్‌ని ఓ రోజు పినతండ్రి రాఘవరావు కోర్టు పనిమీద వచ్చి తన వూరికి వెళ్ళిపోతూ,

"ఒరే మురళీ మా వూళ్ళో ఓ అందమైన చదువుకున్న అమ్మాయి వుంది చూస్తావా !" అని అడిగాడు.

"పనిపాటల వచ్చునా! అణకువగల్గిన పిల్లేనా" అన్నాడు మురళి.

"నువ్వేరా ! నా వెంట నీక్కావల్సినవన్నీ వున్నాయి" అంటూ వెంటబెట్టుకు వెళ్లి అమలని చూపించాడు. అమల వివరాలన్నీ "నచ్చింది" అన్నాడు మురళి. కానీ అమల యెదుట పెదవి కదపకుండా చాటున రాఘవయ్యగార్ని ఓ ప్రశ్న వేసింది.

"'లా' చదువు పూర్తిచేయాలి. యిదే షరతు." అని

"అబ్బాయ్! యిదీ అమ్మాయి వుద్దేశ్యం" అన్నాడు రాఘవయ్య.

"ఓ అలాగే" అని అనాడు మాట యిచ్చేసి మూడుముళ్లూ వేసి అమలని ఆనందంగా కాపురానికి తీసుకువచ్చాడు. వారం తిరక్కుండానే అమల అల్మారాలోని 'లా' పుస్తకాల దుమ్ము దులిపి భర్త ముందు పెట్టి 'చదువు ప్రారంభించండి' అంది. అనేసి వూరుకోలేదు. ఓ టైంటేబుల్ తయారుచేసి ఎదురుగా గోడకి తగిలించింది. ఎంత టైము నిద్రకి వినియోగించాలో ఏ టైములో స్నానం కాఫీ కానివ్వాలో ఎన్ని గంటలు చదువుకోవాలో! వగైరా. గంటలూ నిముషాలతోసహా రాసేసింది. దీనికి కాస్త యిటూ అటూ అయినా భరించలేదు అమల. మురళీమోహన్ పెళ్ళిచూపులనాడు అమల ముఖంలోకి చూసి "ఒట్టి అమాయకురాలులా వుంది కాపురంలో నాదే పైచేయి అనుకున్నాడు." కానీ మంగళసూత్రం కట్టినవాడు బొత్తిగా అమాయకురాలు కాదులా వుంది అనుకున్నాడు.

కానీ కాపురానికి వచ్చి పైట నడుందగ్గర దోపి చకచకా పనులన్నీ చక్కపెట్టుకునే అమలనిచూసి నాకు నచ్చినపిల్ల అదృష్టం కొద్దీ దొరికింది అని మురిసిపోయాడు. వారం తిరక్కుండా 'లా' పుస్తకాలు ముందేసి 'చదువుకు తీరాలి' అని గదిలోపెట్టి తలుపులేసి అవతలకి వెళ్ళిపోయిన అమలనిచూసి 'అమ్మయ్యో ఆడవాళ్ళని అర్ధం చేసుకోవటం అంత తేలికకాదు" అనుకున్నాడు. మనస్సు 'వెధవ చదువు' అని మొరాయిస్తూన్నా 'లాభంలేదు. బద్ధకాన్ని పారిపోయేలా చెయ్యాలి' అనుకుంటూ బలవంతంగా మనస్సుని చదువుమీద లగ్నం చేయటానికి ప్రయత్నిస్తూన్న భర్తని వంటపని చేసుకుంటూనే వో కన్ను యిటు వైపు వేసి వుంచిన అమల 'యీయన్ని చదివించటం చాలాకష్టమే అనుకుంది. కానీ చదివించి తీరాలి. తనభర్తకి 'లా' డిగ్రీ వచ్చి తీరాలి. అన్న పట్టుదల పెరిగిపోయింది అమలలో.

## 4

అమల తొందరలోనే ఆ వాటాలవాళ్ళతో కల్సిపోయింది. ప్రతికుటుంబంలోని పరిస్థితులూ అర్థమైనాయి. కమలమ్మఅన్న ఆవిడకి యిద్దరుపిల్లలు. ఆవిడ మొగుడికి ఓ పెద్ద కంపెనీలో చిన్నవుద్యోగం. అసలు వచ్చే జీతమే చాలదు. అయినా ఆయనకి డబ్బెట్టి పేకాడే వ్యసనంవుంది. యింట్లోబియ్యంలేకున్నా అర్ధరాత్రివరకూ పేకాడిగానీ యిల్లు చేరడు.

పాపం కమలమ్మని చూస్తే జాలిముంచుకు వస్తుంది అమలకి. కానీ తనకాపురం గుట్టుగా వుంచుకుని యెదటివాళ్ళ విషయాలు వీధికి

---

వలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఆందోళన కలుగుతుంది. వారం ఆఖరులో అనుకూలమైన వార్తలను వింటారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం:-** రావలసిన డబ్బు అందగలదు ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో ప్రయాణ కలుగు తుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు.

**మకరం:** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**కుంభం :-** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లభిస్తాయి. స్త్రీలకు — దైవ కార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. అనుకూలమైన వార్తలను వింటారు. మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

లాగి తృప్తిపడే ఆవిడ స్వభావానికి మాత్రం చికాకు కల్గుతుంది. ఆ వాటాల్లో వున్న మగాళ్ళు సామాన్యంగా ఏడూ ఎనిమిదిగంటల కల్లా యిల్లు చేరతారు.

కమలమ్మ భర్త రాడు. అమలభర్త వచ్చినా భోజనంచేసి చదువులో మునిగిపోతాడు. యీ మధ్య మురళీమోహన్ చదువులో చాలాశ్రద్ధ చూపుతూన్నందుకు మురిసిపోతూన్న అమల ఆదివారం సినీమాకి వెడదాం అనికూడా అడగటంమానేసింది, వంటరిగా కూర్చునీకూర్చునీ బోర్ కొడుతూంటే తప్పనిసరికి కమలమ్మదగ్గరికి కాలక్షేపంకోసం వెడుతోంది. ఓ రోజు కమలమ్మ యేవేవో కబుర్లు చెప్తూ.

అమలా ఆ శ్యామల వుంది చూశావూ ! అబ్బ యెంత స్వార్ధపరురాలో అంటూ ఆమె భర్తని యెలా కీలుబొమ్మని చేసి ఆడించి తను మాత్రం యెంతసుఖపడుతూందో చెప్తూ యివాళ నూర్రూపాయిల చీరె తేవాల్సిందే అంటే చచ్చినట్లు తెస్తాడు. స్నేహితులతో కల్సి క్లబ్బుక్కానీ సినీమాక్కానీ వెళ్లద్దు అని అంటే మానేస్తాడు. అబ్బ ఎంత అదృష్టం శ్యామలది. ఆయనలాంటి మొగుడు



రావాలంటే ఎన్నినోములు నోయాలో! శ్యామల అదృష్టానికి లోలోపల అసూయపడే కమలమ్మని చూస్తూంటే చచ్చేంతనవ్వువచ్చింది అమలకి.

"ఎందుకూ నవ్వుతావూ" కోపంగా అడిగింది కమలమ్మ.

"శ్యామలది అదృష్టం అంటారా! నే ఒప్పుకోను" అంది ఖచ్చితంగా. యీ మాటలు నచ్చక కమలమ్మ సంభాషణని మరో వైపుకి తప్పింది.

"ఔనూ! శ్యామల మొగుడు అస్తమానం కిటికీదగ్గర కూర్చుని మీ వాటా వైపే చూస్తుంటాడట. యిక్కడవాళ్ళు అందరూ చెప్పుకుంటున్నారు."

"ఏమిటీ!" అమల తెల్లబోతూ అన్నదే కానీ కోపం ముంచుకొచ్చింది.

"అసలాయన్ని నే నింతవరకూ చూడనే లేదు."

'నా కవన్నీ తెలియవు' అంటూ కమలమ్మ రెండోపిల్ల యేడ్పు మొదలెట్టేసరికి అమల యింక లేచి తన వాటాలోకి వచ్చింది.

టేబుల్ లైటు వెలుగుతూనే వుంది. చదువుకుంటూ పుస్తకం అలాగే వదిలేసి మురళీమోహన్ నిద్రపోతున్నాడు. అమలకి నవ్వూ కోపమూ వచ్చింది. లైటు తీసి భర్తను లేపింది.

## 5

కాలం దొర్లిపోతోంది. మురళీమోహన్ పరీక్షలు దగ్గర పడ్డాయి. అయినా ఓ రోజు 'అమలా పద సినీమాకి పోదాం' అన్నాడు.

'అయ్యో' అంటున్నా అమలని సినీమాకి ఫ్రెండ్ ఎరువు స్కూటర్ మీద తీసుకు వెళ్లాడు. సినీమా చూసి వస్తూండగా ఓ సైకిల్ అడ్డంగా వచ్చి స్కూటర్ మీద నుంచి క్రింద పడ్డారు. అమలకి గుండె ఆగిపోయినంత పనైంది. పెద్ద దెబ్బలు కాకున్నా కాళ్లకీ చేతులకీ పెచ్చులూడిపోయాయి. మురళికి కాస్త మోపుగానే తగిలినా భార్యకి ధైర్యం చెప్పి డాక్టర్ దగ్గరికి తీసుకువెళ్ళి యిద్దరూ మందు వేసుకుని మరీ యింటికొచ్చారు.

మరునాడు శ్యామల అమ్మలక్కలతో యీ

గార్త చెప్పి నవ్వటం విన్న అమలకి మండి పోయింది.

"ఎరువు స్కూటర్ యెక్కితే మరింకెలా జరుగుతుంది" అన్న మాటకి మండి పోతోంది. సరాసరి శ్యామల దగ్గరకి వెళ్ళింది తగూకి.

"మా యిష్టం మాది. మధ్య నువ్వెవరు నవ్వటానికి"

"నీ మొగుడు 'లా' చదువుతున్నాడని మహా గర్వపడుతున్నావుగానీ సిగ్గు లేకుండా పిల్లలతో గోడుంబిళ్ల ఆడతాడు. గోలీ లాడతాడు. క్రికెట్ ఆడతాడు. యేం చిన్న కుర్రాడా!" శ్యామల ఏదేదో అంటోంది అసలు విషయం వదిలి. ఇందుకు మరీ కోపం వచ్చింది అమలకి. 'ఛీ! మొండివాడు రాజు కంటే బలవంతుడు.' అనుకున్నా కోపం ఆగలేదు.

"నామొగుడు ఏ ఆటలాడినా నాకిష్టమే. యెరువు స్కూటర్‌మీద ఎక్కించి క్రింద పడేసినా నాకిష్టమే. చూడూ మమ్మల్ని గురించి మళ్ళీ మాట్లాడావా మర్యాద దక్కదు" అంటూ రుసరుసలాడుతూ యింట్లోకి వచ్చింది.

ఆరుగంటలు అవుతున్నా మురళీమోహన్ యింకా యింటికి రాలేదు. కానీ శ్యామల మొగుడు అయిదున్నరకి ఠంచనుగా యిల్లు చేరతాడు. మళ్లీ ఎక్కడికీ వెళ్లడు. యీ విషయం అప్పుడప్పుడూ అమ్మలక్కల కబుర్లలో చెప్పి తెగ గర్వపడుతూ వుంటుంది శ్యామల. ఇందుకు మాత్రం కమలమ్మకీ అమలకీ మనస్సులో కాస్త అసూయగా వుంటుంది. కానీ పైకి ఏమీ అనలేరు. అమల భర్తకోసం యెదురుచూస్తూ వీధివాకిట్లో నిల్చుంది.

యింతలో కమలమ్మ కేకలు బిగ్గరగా వినిపించాయి.

"ఏమిటి! యేమైంది..." ఆదుర్దాగా అడిగింది అమల అటుగా వచ్చిన ఓ పిల్లని.

కమలమ్మగారి కొడుకు ఆడుకుంటూ వెళ్ళి వరలబావిలో పడ్డాడు. అంటూ పరుగెత్తింది. 'ఆ...' అమల నోటినించి మాట రాలేదు. అసలు ఆ వాటాలో కొన్ని సంవత్సరాల కితం పంపులు వుండేవి కావు. ఆ బావి నీళ్లే వాడుకునేవారు. తర్వాత యింటాయన కుళాయిలు పెట్టించినా అవి రానప్పుడూ నీళ్ళు చాలనప్పుడూ ఆ నూతి నీళ్ళు చేదుకుంటూనే వుంటారు ఆ కాపురాలవాళ్ళు. అందరు పిల్లలూ చేరి అక్కడున్న చెట్లలో ఆడటం అలవాటేగానీ యీ ప్రమాదం యెలా జరిగిందో. శ్యామలతో యీ మధ్య కమలమ్మ అమలమీద చాలా చాడీలు చెప్తూవుంది అని తెల్సింది. అందుకే ఆవిడంటే ఒళ్ళు మండి వాళ్ళింటికి వెళ్లటం తగ్గించుకుంది. శ్యామలా కమలా అతి సన్నిహితులుగా మసులుతున్నారు.

యివన్నీ గుర్తు తెచ్చుకున్న అమల బాగా అయింది అనుకుంది ఒక్క క్షణం. కాని అంతలోనే అభం శుభం తెలియని అయిదేళ్ల కమల కొడుకు గుర్తుకివచ్చి అయ్యో అనుకుని ఆదుర్దాగా నూతిదగ్గరకి పరుగున వచ్చింది.

"అయ్యో అయ్యో మగాళ్లెవరన్నావుంటే రమ్మనండమ్మా! నా బిడ్డని రక్షించమని అమ్మా అయ్యో" గుండెలు బాదుకుంటూ నూతిదగ్గర నిల్చుని యేడ్చేస్తోంది కమలమ్మ.

ఆ వాటాల్లోవున్న ఆడవాళ్ళూ పిల్లలూ అంతా చేరారు.

అదిగో శ్యామలగారి మొగుడొచ్చాడు అన్నాడు ఒకరు.

"నా తల్లీ రమ్మనండి ... బాబూ నా బిడ్డని రక్షించమను... నాయనా నా బిడ్డ"

నలుగురు పట్టుకు ఆపినా ఆ నూతిలో దూకేసేందుకు సిద్ధపడుతూ వుంది కమలమ్మ.

అప్పటివరకూ సానుభూతి చూపిస్తున్న శ్యామల భర్త నూతిదగ్గరికి రాబోతూంటే "అయ్యో! మీకసలే జ్వరంగావుంది. అయినా ఆ నూతిలో ఎలా దిగ్గలరు. మీకేమన్నా అయితే నా గతేంగానూ అంటూ అమాంతం చెయ్యి పట్టుకుని యింట్లోకి లాక్కువెళ్లి తలుపు ధామ్మని వేసేసుకుంది.

"అయ్యో అయ్యో అసలీవిడ మనిషేనా! అవతల అయిదేళ్ల పసివాడి ప్రాణం అట్టిట్టు అయిపోతూంటే"

అందరూ తలోమాటా అనేస్తున్నారు. అమలకైతే శ్యామలని మింగేద్దామన్నంతకోపం వచ్చింది. ఆవిడ ఒట్టిస్వార్థపరురాలు సరేగానీ ఆయనకే నాబుద్ధి వుండక్కర్లా. పెళ్లాం రమ్మనగానే అలా కీలుబొమ్మలా వెళ్ళిపోవటమే. ఛీ...ఛీ. పాపం పసివెధవ అయ్యో ... అంటూ ఒకే కంగారుపడిపోతూండగా...

'అమలగారూ మీ ఆయనొచ్చాడు.' అని ఒకరంటే

'ఆంటీ అంకుల్ వచ్చారు...' అని పిల్లలు అరుస్తూన్నారు. కమలమ్మ అమల రెండు చేతులూ పట్టుకొని భోరుమంది.

"అమ్మా అమలా యింక మీరిద్దరే నాకు దిక్కు. నా బిడ్డని రక్షించండి రమ్మను కాస్త మీఆయన్ని రమ్మను అమ్మా...నీ యింట్లో పాచిపని చేసైనాసరే నీరుణం తీర్చుకుంటా నాబిడ్డ...ని రక్షించండి"

ఆఫీసునుంచి ఆలస్యంగా వచ్చి ప్రహరీ గేటు తీసుకుని లోపలికి వస్తూన్న మురళీ మోహన్‌కి అప్పుడే కొందరు పిల్లలు యెదురు వెళ్ళి యీవార్త అందించారు...అంతే అతను. 'ఆ...' అంటూ పరుగున వచ్చేశాడు చెప్పులు వదిలి వరలమీదగా లోపలికి దిగుతూంటే నూతిచుట్టూ వున్న ఆడవాళ్ళు ప్రాణాలు బిగవట్టుకుని చూస్తూన్నారు. నాలుగువరల



# ధర్మ పథం



బులుసు వేంకట రమణయ్య

భగవంతుడు కొందరి యెడల ఎక్కువ కృప చూపుతున్నాడు. కొందరి యందు అది తక్కువగా కాన వస్తుంది. ఇలాగే కొందరికి ఎక్కువ శక్తిని ఇస్తాడు. కొందరికి తక్కువ శక్తిని కలిగిస్తాడు. ఈ తారతమ్యానికి కారణం ఏమిటి ?– ఈ ప్రశ్న సామాన్యుల కందరికీ కలుగుతుంది. సామాన్యులకే కాదు. ఈశ్వరచంద్ర విద్యా సాగరుని వంటి మహనీయునికే కలిగింది. ఆయన ఈ విషయమై తన సందేహాన్ని వెల్లడిస్తే– శ్రీ రామకృష్ణ పరమహంస తగిన సమాధానం చెప్పి ఎంతో తృప్తిని కలిగించారు. ఆయన వివరించినది ఇది–

వ్యత్యాసం కనబడుతూనే ఉంటుంది. అందరిలోనూ ఉండే ఆత్మ ఒక్కటే!

## శక్తి తారతమ్యం

అలాగని మనం మంచివాణ్ణి చెడ్డవాణ్ణి సమానంగా భావిస్తున్నామా? శక్తిగలవానికి శక్తిహీనునికి తేడా చూస్తున్నాము గదా! ఈ వ్యత్యాసానికి భగవంతుని పక్షపాతం కారణం కాదు. ఆయా వ్యక్తుల యొక్కయూ, ప్రాణుల యొక్కయూ యోగ్యతలను అనుసరించియే వారిలో శక్తి వ్యత్యాసం కానవస్తుంది. జీవాత్మకూ, పరమాత్మకూ భేదం లేదుగదా అని దుర్మార్గుడి జీవాత్మ భగవదంశ అని అనుకోవడం బుద్ధి తక్కువ. అది వితండ వాదం అవుతుంది. భగవానుడు భగవద్గీతలో అర్జునుడితో ఈ విషయమయి ఏమి చెప్పెనో తెలుసుకుంటే ఇట్టి సందేహానికి అవకాశం వుండదు.

యద్య ద్విభూతిమత్ సత్వం
శ్రీమ దూర్జిత మేవ వా,
తత్తదేవాగచ్ఛ త్వం
మమ తేజోఽంశ సంభవమ్.'

ఐశ్వర్యంతో కూడినదీ, సంపద్యుక్తమైనదీ, ఉత్సాహం గలదీ ఏదైతే ఉన్నదో ఆ ప్రాణి నా తేజస్సుయొక్క అంశం వల్లనే కలిగినదని గ్రహించాలి. అని దీని భావం.

దీనినిబట్టి ఉత్తమ గుణాలు ఉండే వ్యక్తులలోనే భగవదంశ ఉంటుందనీ, అట్టి వ్యక్తులే శక్తిమంతులు కాగలరనీ తెలుస్తున్నది. ఆయన అంశ ఎక్కడైతే ఉంటున్నదో అక్కడనే ఆయనకు ఎక్కువ కృప ఉంటున్నట్లు ఊహించడానికి అవకాశం ఉంటున్నది.

పరమహంసలు ఈ విధంగా తగినరీతినే సమాధానం యిచ్చి సందేహాన్ని పోగొట్టినారు.

విశ్వమంతా భగవంతుని చిద్విలాసమే! అంతటా అతడు వ్యాపించి ఉండుట వాస్తవమే. అయితే కుశ్శంకలు వేసుకుని 'భగవంతుని పక్షపాతం వుండడం లేదా? అందరి యెడలా సమానంగా ఎందుకు ఉండడం లేదూ?'' అని కొంటె ప్రశ్నలు వెయ్యడం మాత్రం సముచితం కాదు.

---

లైనా దిగకుండానే పాచిపట్టిన వరమీద కాలు జారి దభేలున నీళ్ళలో పడిపోయాడు.

'అమ్మో' పెద్ద కేకపెట్టేసింది అమల. అంతే స్పృహతప్పినట్లు అయిపోయింది.

పావుగంట తర్వాతగానీ అమలకి వళ్ళు తెలియలేదు. కళ్ళు తెరిచి చూసేసరికి మురళీమోహన్ కమలమ్మ కొడుకూ పైకి వచ్చేశారు. కుర్రాడు నీళ్ళు తాగేశాడని డాక్టర్‌కోసం పరుగెత్తారు.

డాక్టరు రావడం కుర్రాడికి మరేం ఫర్లేదని చెప్పటం. చేతులూ కాళ్ళు గోక్కుపోయిన దెబ్బలకి మందిచ్చి మురళిగార్నికూడా మరేం ఫర్లేదు ఒకవేళ రాత్రికి జ్వరంవచ్చినా భయపడకండి. యెందుకంటే చన్నీళ్లలో చాలాసేపు వుండిపోయారుకదూ...యీ మందు కూడా వెయ్యండి అని చెప్పి వెళ్ళిపోయాడు.

కమలమ్మ మురళీమోహన్‌ని సాక్షాత్తూ ''ఆ దేవుడివే నాపాలిటనువ్వు,బాబూ నీ రుణం తీర్చుకోలేనిది. నా బాబు ప్రాణానికి నీ ప్రాణం అడ్డం వేశావు. మీ దంపతులని నూరేళ్ళు ఆ దేవుడు చల్లగా చూస్తాడు'' అంటూ

## పప్పెట్

కృతజ్ఞతల వర్షం కురిపించి వెళ్ళింది.

మురళీమోహన్‌కి జ్వరంరానే వచ్చింది. అమల అతన్ని వదలకుండా మంచందగ్గరే కూర్చుండిపోయింది. ఇంత జరిగినా శ్యామల తలుపు తీయలేదు.

ఒకవైపు జ్వరంతో పడుకునే భార్య చెప్పే కబుర్లు వింటూన్నాడు మురళీమోహన్.

అప్పుడు తనెంత భయపడిందీ యింకా యింకాచెపూ్తా ఒక్కచోట కాపురాలు వుంటూ అవసరంవస్తే సాయపడని శ్యామలనీ ఆమె మాట విని వెనక్కివెళ్లిన ఆమె మొగుడినీ దుయ్యబట్టేస్తోంది. నవ్వు వచ్చింది మురళీమోహన్‌కి.

''అసలు ఆ శ్యామల మొగుడంటే నీకెందుకూ అంత కోపం'' అడిగాడు.

'అతనా... అతనంటే నాకు కోపం ఒక్కటేకాదు... అసహ్యంకూడా అతనొట్టి 'పప్పెట్స్' అంది ఆవేశంగా.

అతను నీకు యిదివరకే తెల్సునా.

''వూ... నాకు కాబోయి తప్పిపోయిన పెళ్ళికొడుకు.''

''అలాగా!'' మురళీమోహన్ చాలా రోజుల తర్వాత తృప్తిగా నవ్వాడు, ఇదుకా ఆయనెప్పుడూ కిటికీలోనించి యిటే చూస్తొంటాడు అనుకుంటూ.

''నేను అతని సంబంధం తప్పిపోయినప్పుడు చాలా దురదృష్టవంతురాల్ని అని ఆవేదనపడ్డాను. కానీ వ్యక్తిత్వంలేని ఒట్టి 'పప్పెట్' (కీలుబొమ్మ) అని తెల్సుకుని యిప్పుడు చాలా సంతోషపడుతున్నాను.''

అమల కళ్లలో కన్పిస్తూన్న తృప్తిని చిరునవ్వుతో చూస్తూ అలాగే వుండిపోయిన మురళీమోహన్ నుదురుమీద చెయ్యివేసి వేడి చూస్తూ ''అబ్బా! చాలా వేడి వచ్చింది'' అంది కాస్త భయంగా.

''అదే తగ్గిపోతుంది అమలా... నీ చెయ్యి అలాగే వుంచు. నాకు మంచి నిద్రవస్తోంది'' అంటూ అమల చేతిమీద తన చెయ్యివేసి నొక్కి పట్టుకుని కళ్ళు మూసుకున్నాడు మురళీమోహన్.



ARAVINDA.
బహుమతులు,అవార్డులుగెల్చుకోడం
నూర్జహాన సెంట్సుసాంప్రదాయం
ఆకోవలోకేవచ్చిచేరింది
ట్రాన్స్‌వరల్డ్
ట్రేడ్‌ఫేర్ సర్వీస్
అవార్డ్ 1976-77 బంగారుపతకం
Nurjehan
TRANS-WORLD TRADE FARE
SERVICE AWARD DELHI
మీ అభిరుచికి తగిన సెంట్
నూర్జహాన్
సెంట్స్,బ్రిలియంటైన్,
హెయిర్ ఆయిల్
రోజ్ వాటర్
మాన్యుఫాక్చరర్స్ :-
నూర్జహాన్ సెంట్స్ కంపెనీ
పిఠాపురం.
సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :-
డి.యస్.రావు కంపెనీ
పిఠాపురం.

**తొలికోడి కూసింది, ఇక తెల్లవారింది లేవండి అన్నట్లు పశువులశాల లోని దూడలు తల్లుల దగ్గర పాలు తాగటానికి అరుస్తున్నాయి**

# శృంగారకేళి

## మురాల ఇందిరారఘు

బద్ధకంగా అటు, యిటు, దొర్లుతూ, ఏదో గుర్తుకు వచ్చినట్లుగా లేచి ప్రక్కమంచం మీద నిద్రపోతున్న భర్తని ఒకసారి చూసి బయటకు వచ్చింది 'దమయంతి' పాలేర్లకు పనులు పురమాయిస్తున్న అత్తగారి దగ్గరకు వెళ్లి నిలబడింది.

'ఈ రోజు మన మామిడి తోటలోకి ఏదో సినిమా షూటింగు కొరకని సినిమా వాళ్ళు వస్తున్నారు. చూడటానికి మీరు కూడా వస్తారా అత్తయ్యా' దమయంతి వర్ధనమ్మను అడిగింది.

"తెల్లవారిందో లేదో సినిమా వాళ్ళ గురించేగాని, ఒక రామా, ఒక కృష్ణా అంటూ ఏమిలేదటే" వర్ధనమ్మ విసుక్కుంది.

పళ్ళుతోముకుంటూ షూటింగ్ చూడటానికి వెళ్ళేటప్పుడు ఏమి చీర కట్టుకోవాలా, ఎలా మేకప్ అవ్వాలా అని ఆలోచించుకుంటున్నది, దమయంతి. సినిమాలంటే చిన్నప్పటినుంచి దమయంతికి ఎంతో యిష్టం కానీ, వాళ్ళ నాయనమ్మ సినిమాలకు వెళ్ళనిచ్చేదికాదు. పెండ్లి అయిన తరువాత పల్లెటూరు రావటంతో సినిమాలు చూడటం అసలు లేనేలేదు. ఎప్పుడైనా దమయంతి, భర్త "ప్రకాష్" బస్తీకివెళ్ళి ఒకటో రెండో సినిమాలు చూసి తిరిగి వస్తారు.

ప్రకాష్ వర్ధనమ్మగార్కి ఒక్కడే కొడుకు. అగ్రికల్చర్, బి యస్.సి చదివి, తాత తండ్రులు సంపాదించిన పొలం ఇరవై అయిదు ఎకరాలు ఉంది కనుక దాన్ని దగ్గరవుండి నవీన పద్ధతిలో పండిస్తున్నాడు.

భర్త అలా పొలాలవెంట తిరిగి, పనిపాటలు చేయటం దమయంతికి ఏ మాత్రం నచ్చదు. అందరూ అనుకునే నాగరిక లక్షణాలు ఆమెకు యిష్టం. సాయంత్రమయ్యేసరికి, సినిమాల్లోలాగా యుగళ గీతాలు పాడుకుంటుంటే అదే జీవితం అనుకునేది, దమయంతి. అలానే వూహించుకునేదికూడా. భర్త ఆఫీసరు అయితే బాగుండు ననుకొనేది.

బాత్‌రూము వేపుకి వచ్చి, అక్కడ ఏవో వూహాలోకాల్లో విహరిస్తున్న భార్యను చూసాడు ప్రకాష్. "దమయంతీ ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

'ఏమండీ మనం ఎన్నింటికి వెళదాము' దమయంతి తిరిగి ప్రశ్నించింది.

"ఎక్కడికి" ప్రకాష్ ప్రశ్న వేశాడు కొంటెగా. "తెల్లవారిందా తిరగటాన్కి" నవ్వుతూ అతనే అన్నాడు.

మన తోటలోకి సినిమావాళ్ళు వస్తున్నారని చెప్పారుగా. ఆ హీరోయిన్ మాలతి ఎలా వుంటుందో చూద్దామని," తన ధోరణిలో చెప్పుకుపోతూంది, దమయంతి.

"అక్కడికి మనం ఎందుకు? సినిమాల్లో చూస్తాంగా", ప్రకాష్ అదోలా అడిగాడు.

"వాళ్ళని చూడని జన్మ ఎందుకండీ" అమాయకంగా అంది దమయంతి.

"వాళ్ళేం దేవతలు కారుగా?" తీసిపారవేసినట్లు అన్నాడు ప్రకాష్.

"అయ్యో మీరు భలేవారండీ, దేవుడు దిగివచ్చాడన్నా, అందరూ చూసినతరువాత చూడవచ్చులే అనుకుంటారుగాని, సినిమాలో పరిచారిక వేషం వేసిన నటి వచ్చిందంటే కూడా అక్కడ పెద్దక్యూ, పోలీసు బందోబస్తు అన్నీ తయారు అవుతాయి. అవకాశం కొరకు అందరూ ఎదురులు చూస్తారు. మాలతి మన తోటలోకి వస్తుందంటే మనం ఎంత అదృష్టవంతులమండీ," పులుస్టాప్, కామా లేకుండా చెప్పుకుపోతుంది, దమయంతి.

"అయినా ఈరోజు నేను పొలానికి నీళ్ళు పెట్టించాలి. మోటారు ఒకటి చెడి పోయింది. నేను తొందరగా పొలానికి వెళ్ళాలి" ప్రకాష్ అన్నాడు.

"అవును లెండి మీకు పొలం, ఎడ్లు వుంటే చాలు, ఏదైనా సరదాపడి అడిగితే ఏదో వంక పెడతారు ఛీ! నాలాంటి జన్మ ఎవరికీ వద్దు" ముడుచుకున్న ముఖంతో విచారంగా ఇంట్లోకి వెళ్ళుతున్న దమయంతిని చూస్తూ వుండి పోయాడు ప్రకాష్.

అటుగా వచ్చిన వర్ధనమ్మ "బాబూ! ప్రకాష్! పొద్దుటే ఏమిటిరా నాయనా, ఆ గొడవ" అంది.

"ఏముందమ్మా, మన తోటలోకి ఎవరో సినిమావాళ్ళు వస్తున్నారు. వాళ్ళను చూడటానికి అక్కడికి వెళదామని నీ కోడలు పేచీ" వివరించాడు కొడుకు.

"బాబూ, సాయంత్రంగాని, రేపుగాని పొలానికి నీళ్ళు పెట్టించవచ్చునులే! యీలోపు పాలేర్లు చూస్తారు ఆపని. వెళ్ళిరండి. ఇక నీ భార్య అలిగిందంటే అన్నం, నీళ్లు కూడా ముట్టదు. ఒకరో, యిద్దరో పిల్లలు పుడితే అదే మారుతుంది" అంది. కాఫీ కలపటానికి వంటయింట్లోకి వెళ్ళిపోయింది వర్ధనమ్మ. కొడుకు, కోడలు కలిసి మెలిసి తిరగటం ఆమెకు సరదాగానే వున్నట్లు పైమాటలంది.

"అమ్మాయీ! దమయంతీ" వర్ధనమ్మ ఎన్ని కేకలు పెట్టినా పలకలేదు దమయంతి.

ప్రకాష్ బెడ్ రూమ్‌లోకి, వచ్చేసరికి ఇటు తిరిగివున్న దమయంతి భర్త మొఖం చూసి, పాపంలాగా అటు తిరిగి పడుకుంది.

"నా మీద కోపం వచ్చిందా రాణిగార్కి?" అటు వైపు నుంచి సమాధానం లేదు.

"రాణీ. తోటలోకి వెళదాంగానీ తయారవు మరి" దమయంతిని తన వైపుకి త్రిప్పుకున్నాడు.

"వదలండీ అంటే" అలక మానలేదు దమయంతి.

"వదలనంటే వదలను. సరేగాని ఈరోజు మన పోగ్రాం సినిమా షూటింగ్ చూడ్డమేగా?" జుట్టు నిమురుతూ లాలనగా అడిగాడు ప్రకాష్.

కన్నుల లోని వెన్నెల సోనలు కనపడనీయకుండా జుట్టు ముఖంమీద పడింది

పెద్దకథ ప్రారంభం

దమయంతికి. ఆమె మీదవాలిపోతూ "నీ కళ్ళను అలా నీకురులలో దాచకు" ప్రకాష్ వారించాడు.

"నేను ఎక్కడికి రాను, పాలానికి వెళ్ళండి" దమయంతి కోపాన్ని అభినయిస్తూ అన్నది.

"నీ నోరు ఎలా మూయించాలో నాకు తెలియదనుకున్నావా ?" ఆమెని కౌగిలిలోకి తీసుకున్నాడు.

"నీవు ఎంత అందంగా వున్నావో తెలుసా? నీ ముందు మాలతి లాంటివాళ్ళు బలాదూర్" ప్రకాష్ అలా అనేసరికి కోపం అంతా పటాపంచలైపోయింది దమయంతికి.

అరగంటలో ముస్తాబయిన కోడలిని వర్ధనమ్మ కన్ను ఆర్పకుండా చూసింది మురిసిపోయింది. అసలే దమయంతిది, ఆకర్షణీయమైన విగ్రహం అందులోను తెల్లని జార్జెట్ చీర. తెల్లసి ముత్యాల హారం సన్నని మెడలో అవి వుంటే ముత్యాలకే అందం వచ్చినట్లుగా వుంది. నిడుపాటి జడలో విరిసీ విరియని తెల్లని జంట గులాబీలు పెట్టుకొని, సినిమా షూటింగ్‌ని చూడటం కోసం బయలుదేరింది. ఆనందంలో, అతని సన్నిధిలో అన్ని సుఖాలతో సాగుతున్న తనజీవితం ఇస్తున్న తృప్తితో, ఆమె ముఖంలో ఎక్కడ లేని కళ తొణికిసలాడింది.

స్కూటర్ మీద వాళ్ళు ఇద్దరూ వెళుతూ వుంటే చూడ ముచ్చటగా వున్న ఆ జంటను చూస్తున్న వర్ధనమ్మ కళ్ళు ఆనందంతో మెరిశాయి,

ప్రకాష్ దంపతులు తోటలోకి చేరేసరికి చుట్టు పక్కల జనంతో ఆ ప్రదేశం త్రొక్కిసలాటగావుంది. పోలీసు బందోబస్తుగావుంది. తోట యజమాని కాబట్టి ప్రకాష్ దంపతులకు లోపలికి ప్రవేశం చాలసులభంగా దొరికింది రంగు రంగుల దుస్తులతో సినిమా నటీనటులు చూడ ముచ్చటగా వున్నారు.

అంతకు క్రితంరోజే తోటను షూటింగు కోసం అడిగినప్పుడు సహాయ దర్శకుడు ప్రకాష్‌కి సినిమాకథ చెప్పటం, దమయంతి వింది.



ఆ సినిమా పేరు "అంతరించిన అంతస్థులు" ఎక్కువమంది నటీనటులు కొత్తవారట.

దమయంతి మాలతిని ఒక దేవలోక సుందరిని చూసినట్లు చూసింది. అంతా ఒకచోట చేరారు. "ఎంత అదృష్టవంతులండీ మీరు" మాలతికి చేరువగా కూర్చొని దమయంతి అంది. ఆమె ప్రక్క కూర్చోవటం అదృష్టంగా భావించింది దమయంతి. మాలతి నవ్వింది. "నా అదృష్టం పగవారికైనా వద్దమ్మా" ముఖంలో హార్పు తెచ్చుకున్న మాలతి చిన్నగా అంది. ఆమె మాటలు దమయంతికి అర్థంకాలేదు. పాపం మాలతి దమయంతికి తన కథ చెప్పాలనుకుంది. కాని షూటింగ్ బ్రేక్‌లో అలసిపోయి వుంది.

నిజానికి హీరోయిన్ మాలతి కథ వేరు. ఆమె దమయంతి అనుకుంటున్నంత సుఖపడటంలేదు.

అంతటి అదృష్ట భామ లేమ గుండెలో విషజ్వాలలు వికృత రూపంలో విహరిస్తున్నవి అంటే ఎవరు నమ్మలేరు ఆమెదొక విచిత గాథ.

* * *

మాలతి షూటింగ్ నించి యింటికి వచ్చింది. బట్టలు కూడా మార్చకోకుండా మంచం మీద వాలింది అలసటగా.

అప్పుడే స్కూలు నుంచి వచ్చిన బాబు "మమ్మీ" నన్ను నిన్న "ఆయా" కొట్టింది అంటూ ముద్దు ముద్దుగా అన్నాడు.

"ఎందుకు కొట్టింది బాబు" మాలతి బాబుని దగ్గరకు తీసుకొంటూ అడిగింది.

"నేను బిస్కట్లు పెట్టమన్నాను, "ఆయా" ఏమో నాకు ఒకటి ఇచ్చి, తను రెండు తింది; మా మమ్మీకి చెపుతానంటే చెబితే నిన్ను చంపుతాను," అని, కొట్టింది, అన్నాడు దీపక్.

"మరి నాన్నగార్కి చెప్పలేక పోయావా నాన్నా," అంది మాలతి బుజ్జగింపుగ.

"చెప్పానుగాని, నాన్నేమో "ఆయా" చాలా మంచిది, కొట్టదు, నువ్వే ఆమెను యేదో అని వుంటావన్నారు." బాబు చెప్పాడు పిర్యాదు చేసినట్లు. తండ్రి ఆమెను సమర్థించినట్లు అభియోగం మోపాడు బాబు.

"నాన్నగారిని, నేను కనుక్కుంటాలే

# { యువతరం }

"నేను రోజూ లైబ్రరీలకు వెళ్తాను. హాస్యరసం గల పుస్తకాలు చదవడమంటే ఇష్టం" అన్నాడు ఒక మంచి స్టూడెంట్ అయిన వి. చంద్రశేఖర్.



కొత్త సినీమాలకంటే పాత సినీమాలే ఎక్కువగా చూస్తాడు. సినీ తారల్ని చూడాలంటే సరదాయే కాని ఇంతవరకు ఎవర్నీ చూడలేదుట! క్రికెట్ ఆడతాడు. కామెంటరీ అంటే చెవి కోసుకుంటాడు. కార్టూన్లు గీసే అలవాటున్న ఈ పదిహేడేళ్ల యువకుడికి మంత్రుల్ని చూడాలన్న సరదా లేదు. "నాకు రాజకీయాల్లో ప్రవేశం లేదు. అయినా వాటిని గురించి తెలుసుకోవాలనివుంది" అని చెప్పాడు ఇందిరాగాంధీ అంటే చాలా ఇష్టమని చెప్పిన ఇతడు "క్యాలో" నుంచుంటానికే ఇష్టపడతాడు [సహజమేకదా] పేపరు చదివినపుడు ముందు హెడ్డింగ్స్ ఆ తరువాతే మిగిలిన అంశాలు చదువుతాట్ట!

– సు.

## ఓతార కథ

బాబూ," అని మాలతి వాణ్ణి బుజ్జగించటంతో బాబుకి ఎక్కడలేని తృప్తి కలిగింది. అమ్మమీద విశ్వాసం పెరిగింది. ఆడుకోవటానికి అవతలికి వెళ్లాడు.

మాలతి తన మేకప్ అంతా తీసివేసి, అద్దంలో తన ఒరిజినాలిటీ చూసుకుంది. గులాబీరంగు కేక్ అంతా పోయి, గుంటలు పడ్డ నల్లని మొఖం చూసుకుంటుంటే, మాలతి మొఖం మాలతికే ఎబ్బెట్టుగా కనిపించింది. నిన్న తోటలో షూటింగ్ చూడటానికొచ్చిన దమయంతి, ప్రకాష్‌ల జంట ఎంత అందంగా వున్నారు అనిపించింది. ఆమె మొఖంలోని తృప్తి ఆనందం ఎందరికో కదా? అని మాలతి మనస్సులో వ్యధ చెందింది.

[ఇంకా వుంది]

# * ఫాలాక్షుని డైరీ *

## అబద్ధం చెప్పినట్లు నిరూపిస్తే రాజీనామా

ఇటీవల అమెరికా జనాధిపతిగా ఎన్నికయిన జిమ్మీకార్టర్ తనాపదవికి ఎన్నికయినట్లయితే తానొక్కసారైనా పదవీ కాలంలో అబద్ధం చెప్పననీ, అలా చెప్పినట్టు నిరూపించితే తాను తనపదవికి రాజీనామా యిస్తాననీ అన్నారట!

## 19 మంది పిల్లల తర్వాత పట్టిన అదృష్టం

అహమ్మద్ అనే ఓ 48 ఏళ్ళ యువకుడు ఇటార్సీలో వేసక్టమీ ఆపరేషను [కుటుంబ నియంత్రణ] చేయించు కున్నాడట. ఈయనకు నలుగురు భార్యలు. పందొమ్మిది మందిపిల్లలు వున్నారట. అయినప్పటికి యింకా సంతానాన్ని కనకుండా వుండేందుకీయన శస్త్ర చికిత్స చేయించు కున్నందుకుగాను ఆయన్ని వూరు జనులు పురవీధుల వెంట వూరేగిస్తే, మధ్యప్రదేశ్ ఆరోగ్యమంత్రిగారు ప్రభుత్వం బాకీ పడ్డ [ఆపరేషన్చేయించుకున్న వారికి ప్రభుత్వం ప్రకటించిన బహుమతి] బహుమతిని స్వయంగా చేతికిచ్చారటాఅహమ్మద్‌కు!

### వారానికి నాలుగు రోజులు విశ్రాంతి

ఇండియాలోని ఫియట్‌కారు తయారీకంపెనీలో పనిచేస్తున్న లక్షమంది పనివారూ వారానికి మూడ్రోజులేపనిచేసి, నాల్రోజులు రెస్టు తీసుకుంటున్నారట! కారణం!! తెలియదు.

### కోడలుకు కారుకొనే కొత్త చిట్కా

పారిస్‌లో ఒక కారు వ్యాపారి తనకారులమ్ముడుపోడానికో చిట్కా ఆలోచించాడట. మీ కోడలుపిల్లకు కారు బహుమతివ్వాలనుకుంటున్నారా? నేటి నుంచి ఆ పని ప్రారంభించండి. కారుమొత్తం వెలకాకుండా ఒక్కొక్క భాగం వెలలువున్న పట్టీ యిస్తాము. ఒక్కొక్క భాగానికి మీ వద్ద డబ్బు వున్నప్పుడు మాకుకట్టి, ఒక్కొ భాగం మీ సొంతం చేసుకోండి. అన్ని భాగాలకూ డబ్బు కట్టాక కారు మీకిచ్చేస్తాం అని ఆయన ప్రకటనచేసి, ప్రాపగాండా చేస్తున్నాడట. అప్పుడూ అంతా భాగుందికాని కోడలుపిల్లక్కారేవిటి! మరల్లుడి మాటేవిటి! ఏమో! ఆదేశాచారమేమిటో!

### నందాదేవి మహిమ!

1949లో 22 ఏళ్ళ విల్లీ అనే ఆమె ఇండియాకు వచ్చి హిమాలయాలలోని "నందాదేవి" అనే పర్వతాన్నిచూసి ముగ్ధురాలై నాకో ఆడపిల్ల పుడితే ఆ పిలకు నందాదేవి అని పేరుపెట్టుకుంటా అనుకుందట. ఆమెకు 1954లో పుట్టిన పిల్లకు నందాదేవి అని పేరుపెట్టి ఆమెను యీవల ఇండియా తీసుకు వచ్చిందట. తల్లీ కూతుళ్లిద్దరూ పర్వతారోహణలో మంచి శిక్షణ పొందినవారట. వారిద్దరూ నందాదేవి పర్వతం ఎక్కనారంభించారట. మధ్యలో నందాదేవికి కడుపు నొప్పి వచ్చిందట. అయినాసరే పర్వతం ఎక్కడం మానరాదని తీర్మానించుకుని యింకా ముందుకు సాగిపోయారట. పర్వతాగ్రమింకా పదహారొందల అడుగులుందనగా 8.9.76 నాడు నందాదేవి ఆ పర్వతం మీదనే మరణించిందట.

### రిపేరు రిపేరే!

లండన్‌లోని బిగ్‌బెన్ గడియారం యిటీవల 22 రోజులు పనిచెయ్యడం మానేసి చాలా రిపేర్లు అయ్యాక మళ్ళీ పనిచేయ నారంభించిందట. ఇది వరకు ప్రతి పావుగంటకూ గంటకొట్టేదట. రిపేరు అనంతరం యిప్పుడు గంటకోసారి మాత్రమే గంటకొడుతుందట. ఆ నాడు తయారు చేసిన గడియారాన్ని నాటి అభివృద్ధి చెందిన విజ్ఞానశాస్త్రం రిపేరు చేయలేకపోయిందనా? ఏమో! ఏం తిరకాసో!

### అమెరికాలో మళీ మరణ దండన

అమెరికాలో మరణదండనను మళ్ళీ అమలులోకి తీసుకువచ్చిన శుభ సందర్భంలో కరెంటు కుర్చీలకు రిపేర్లు, పరీక్షలు జరిపారట. అందులో నేరస్థుణ్ణి కూర్చోబెట్టి స్విచ్వేస్తే మెయ్యిమసిబారి షాక్‌తో ప్రాణాలు పోతాయన్నమాట. రిపేర్లన్నీ చేశాక కుర్చీ సరిగా పనిచేస్తోందో లేదోనని ఎక్స్పెరిమెంటూ!! డొక్కు సిల్లీ

### అమెరికాలో దినపత్రికలు!

అమెరికాలో ఓ మాసం చదివి పడేసిన దినపత్రికల పేపర్లన్నీ సమీకరించి మళ్ళీ దాన్ని న్యూసు ప్రింటు కాగితంగాచేస్తే ఆ కాగితం మన దేశంలో ఓ సంవత్సరకాలం పత్రికలన్నీ నడుపడానికి సరిపోయేంత అవుతుందట.

## రాలిన ముత్యాలు

…శ్రీ సోమసుందర్…

క్షయ వ్యాధి పీడితుసిలా సముద్రం
పసుమతి సుందరారోగ్య వక్షం పై
చిమ్ముతోంది సదా విషక్రిమి సమూహం!
అందుకే మూలుగు తోంది
తీరస్థ కేదారం రోగ గ్రస్తమై!

# స్టేన్స్‌టైర్
# సమస్యలను పరిష్కరిస్తుంది



స్టేన్స్ టైర్ రీట్రెడ్‌లు సురక్షితమైనవి. ప్రఖ్యాతి గాంచిన టైర్‌సోల్స్ సాంకేతిక పరిజ్ఞానాన్ని స్టేన్స్‌టైర్ వినియోగించు కుంటుంది. మీ టైరు ఎక్కువకాలం పనిచేసేటట్టు గ్యారంటీ ఇస్తుంది. స్టేన్స్ టైర్ ఎక్కువ ఆదాచేస్తుంది. ప్రతి కేసింగ్‌కు ఎక్కువ రీట్రెడ్‌లు చేయవచ్చు— కాగా లాభకరమైన అంశం. ప్రతి కిలో మీటరును లెక్కకడితే ఖర్చు అతితక్కువ కాగలదు. ముఖ్యమైన కేంద్రాలలో వున్న స్టేన్స్ టైర్ ఫ్యాక్టరీలు వెంటనే సేవచేయడంలో గణతి కెక్కినవి.

**STANES TYRE**

**స్టేన్స్‌టైర్**
**అండ్ రబ్బర్ ప్రాడక్ట్స్ లిమిటెడ్**
**తిరుచి రోడ్, కోయంబత్తూరు**

ఫ్యాక్టరీలుగల ఇతర కేంద్రాలు: మద్రాసు, వెల్లూరు, తిరుచి, సేలం, మదురై, ట్యుటికోరిన్, బెంగుళూరు, మంగుళూరు, విజయవాడ, సికింద్రాబాద్, ఎర్నాకులం, కొట్టాయం, కాలికట్, తిరుపూరు.

# హైదరాబాద్ నోట్ బుక్

### మూర మూర తులసీ సవి

ప్రముఖ హిందీ విద్వాంసుడు శ్రీ వారణాసి రామమూర్తి రేణు యువభారతి రామాయణ సుధాలహరి ఉపన్యాసపరంపరలో హిందీ రామాయణాలను గురించి డిసెంబర్ 5 వ తేదీన ప్రసంగిస్తూ తులసీదాసు రచించిన రామచరిత మానస్ దాదాపు 25 హిందీ రామాయణాలలో చుక్కల్లో చంద్రునివంటిదని, ఉత్తరా పథంలో తులసీ రామాయణ వృత్తాలు గానంచేయని వారంటూ వుండరని, తులసీదాసు తనకాలంలో చెలరేగిన సాంస్కృతిక అరాచకాన్ని ఎదుర్కొనడంకోసం ఆస్తికతా ప్రచారానికి రాముణ్ణి పరమాత్మగా ప్రతిష్ఠించడానికి ప్రయత్నించాడని, అందువల్లనే ఆయన వాల్మీకి రామాయణాన్ని అనుసరించక, అధ్యాత్మ రామాయణాన్ని అనుసరించాడని,అన్నారు. రామచరిత మానస్‌కు బాల అయోధ్యాకాండలు ఆయువు పట్టువని వ్యంగ్య వైభవ విలసితాలని అన్నారు. తులసీదాసు ప్రభావం త్యాగయ్యగారిపై చాల కలదని, 'నీ ఋణము దీర్చనాతరమా, తులసీ కాననమందున విలసితమైన హరిని జూచి'' వంటి ఉదాహరణలిచ్చి సమర్థంగా నిరూపించారు ''రామచరిత మానస్ తర్వాత పేర్కొనదగిన రామకథ కేశవదాసు రచించిన రామచంద్రిక. ఇతడు తులసీదాసు సమకాలికుడు. కేశవదాసు శ్రీ నాధుని వలె దర్బారు కవి హిందీలో రీతి కావ్యాలకు మూల పురుషుడు ఇతడు రామచంద్రికను ఒక్కనాటిలో వ్రాశాడని ప్రతీతి. అది హిందీలో ''లక్ష్యలక్షణ గ్రంధం'' అన్నారు రేణు. 17 వ శతాబ్దిలో కరీంనగర్ జిల్లానుంచి ఉత్తరపథానికి వలస పోయిన 150 బ్రాహ్మణ కుటుంబాలలో ఒక దానిలో జన్మించిన అనుప్రాస సమ్రాట్టని బిరుదనామం పొందిన పద్మాకరభట్టు రామరసాయణ మనే పేర రచించిన రామాయణం కూడ ప్రసిద్ధి పొందినదని రేణు తెలిపారు ఆధునికులలో మైథిలీ శరణగుప్త రచించిన. ''సాకేత్'' ప్రశంసనీయమైన రామాయణ మన్నారు. డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షంపై ప్రసంగిస్తూ, విశ్వనాథపై ఇటీవల చెలరేగిన దుష్ప్రచారాన్ని తీవ్రంగా ఖండించారు. ''సర్వ ధర్మ మూలబీజంగా అవిచ్ఛిన్న సంప్రదాయ మూర్తి అయిన రామాయణం వ్రాస్తున్నానని చెప్పుకున్నారు. ఆయనను విమర్శించేవారు సాహిత్య విమర్శమాని, ఆయన చాదస్తాలు తీసుకుని సాహిత్యంతో ముడిపెట్టికొడుతూ కీర్తికోసం ప్రాకులాడు తున్నారు'' అని సుబ్రహ్మణ్యం తీవ్రంగా విమర్శించారు. ఈ సభకు హైదరాబాద్ జిల్లా కలెక్టర్ శ్రీ వేణుగోపాలరెడ్డి అధ్యక్షత వహించ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ కొండా మాధవరెడ్డి ముఖ్య అతిథిగా వున్నారు. యువభారతి ఇద్దరు ఉపన్యాసకులను ఉచితరీతిని సత్కరించారు.



### ముఖ్యమంత్రి ప్రకటన

''ఇటీవల సంభవించిన తుఫానులు వరదలు తెలుగు రైతునుపాడుచేశాయి, చేలను పాడు చేశాయి. రాష్ట్రాన్ని దోచివేశాయి. ఈ భయంకర భీభత్స సమయంలో ఆ ప్రాంతాల బాధితుల సహాయార్థం తెలుగువారు కదలిరావాలి, ప్రభుత్వ కృషికి చేదోడు వాదోడుగా నిలబడి ఉదారంగా విరాళాలివ్వాలి'' అని ముఖ్య మంత్రి శ్రీ వెంగళరావు డిసెంబరు 1 వ తేదీన ఆంధ్రావళికి విజ్ఞప్తిచేశారు. కొన్ని వందకోట్ల నష్టానికి గురయిన కోస్తా జిల్లాలవారిని ఆదుకొనడానికి అందరం నడుం కట్టాలి, ఇరుగు పొరుగు రాష్ట్రాలు, కేంద్ర ప్రభుత్వమూ తోడ్పడాలి.

### శ్రోతల మనస్సు బిస్మిల్లా

త్యాగరాజ గానసభవారు తమ పదవ వార్షికోత్సవం సందర్భంగా పద్మభూషణ, గమాయిశేఖర శ్రీ బిస్మిల్లాఖాన్ శహనాయి వాద్యంతో శ్రోతల మనస్సును, హృదయాన్ని, మేధను బిస్మిల్లా చేశారు. బిస్మిల్లా ఖాన్ సంప్రదాయ రీతిలో కయాల్‌ను హంస నారాయణి రాగంలోను,ధున్‌ను పూర్వీలోను, ఖయాలును మాల్ ఖోన్‌లోను వాయించారు.గూంజ ఉఠీ శహనాయి చిత్రంలో వాయించిన గీతం వాయించారు. శ్రోతలను తన్మయులను చేశారు.ఆయన అన్న కొడుకు యువకుడు శ్రీ అలీ అబ్బాస్ ఆయనకు శహనాయివారసుడనిపించుకొనేట్టు వాయించారు.బిస్మిల్లాఖాన్ పెద్ద కొడుకు నాజీమ్ హుసేన్ కడు నైపుణ్యంతో తబ్లా వాయించి శ్రోతలను పులకితులను చేశారు. సభవారి పక్షాన ఆర్థికమంత్రి బిస్మిల్లాఖానును సత్కరించారు.

### ఉర్దూమీడియం టీచర్స్ శిక్షణ

రాష్ట్రంలోని మూడు ఉపాధ్యాయ శిక్షణకేంద్రాలు నేరేడుమెట్టు, రాయచోటి, ఏలూరులలో వెంటనే ఉర్దూ మీడియం తరగతులు ప్రారంభించాలని నిశ్చయించిందని విద్యామంత్రి శ్రీ మండలి డిసెంబర్ 4 వ తేదీన ప్రకటించారు. ప్రభుత్వం ఉర్దూ విషయంలో చూపుతున్న శ్రద్ధను ఉర్దూవారు సద్వినియోగం చేసుకోవాలి. తరతరాలుగా తెలుగు గడ్డపై వున్నా, తెలుగుతో ప్రసక్తి లేకుండా పెద్ద పదవులు నిర్వహిస్తూ, తెలుగు ప్రతినిధులుగా చెలామణి అవుతున్న అన్యభాషీయులు, లక్షలాదిగా వున్నారు. వారు, వారి వారసులు తప్పనిసరిగా తెలుగు నేర్చేట్టు ప్రభుత్వం కచ్చితంగా ప్రయత్నించాలి. బడులలో త్రిభాషా సూత్రానికి తోడు ఆంధ్రేతరులకు తెలుగు తప్పనిసరి చేయాలి. తెలుగు తెలియక తెలుగువారుగా ఉద్యోగాలు సంపాదించే అవకాశం కలిగించరాదు.

### వచన కవితా పితామహుడు కుందుర్తి :

1922 డిశంబర్ 16 న వినుకొండలో పుట్టిన కుందుర్తి ఆంజనేయులు మిడిల్ స్కూలులోనే జాషువా ప్రోత్సాహంతో తెలుగు సాహిత్యా ప్రేమాంకురాలు మొలకెత్తాయి. విజయవాడ ఎస్. ఆర్. ఆర్. కళాశాలలో ఇంటర్ చదువుతున్నప్పుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ చలవ వల్ల ఆ అంకురాలు చిగిర్చాయి. 1943లో గుంటూరు ఏ. సి. కళాశాలలో బి. ఏ పట్టం పుచ్చు

(50 వ పేజీ చూడండి)




గర్భిణిగా వున్న స్త్రీకి చాలా ప్రత్యేక తరహా ఆహారం అవసరం. మంచి సమతూకమైనది; తేలిగ్గా జీర్ణమయ్యేది; మంచి పుష్టికరమైనది.

దీని కారణంగానే, యించుమించు ఒక శతాబ్దకాలంగా గర్భిణి స్త్రీలు హార్లిక్స్‌పై ఆధారపడుతున్నారు. అందువల్లే సుచిత్ర తాను గర్భిణిగా వున్న మూడుసార్లు కూడా హార్లిక్స్‌నే నమ్ముకొంది.

సుచిత్రకి, ఆమె డాక్టర్ చెప్పినట్టు, హార్లిక్స్, తల్లికి పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంసకృత్తులు, కార్బొహైడ్రేట్లు సరైన పాళ్ళల్లో సమకూరుస్తుంది. దీనిని సేవించడంవల్ల ప్రొద్దున్న లేవగానే నిస్సత్తువుగా వుండటం తగ్గుతుంది. తల్లిపాలు ఎక్కువగాను, పుష్టికరంగాను వుంటాయి అన్నింటికి మించి, హార్లిక్స్ తేలికైనది, సులువుగా జీర్ణమౌతుంది.

హార్లిక్స్ పుణ్యమా అని, తాను గర్భవతిగా వున్న మూడుసార్లు ఎం సంతోషంగా వున్నాననీ, ముగ్గురు పిల్లలు ఎంతో ఆరోగ్యంగా పుట్టారనీ సుచిత్ర అంటుంది.

**దీనిలో ఆరోగ్యముంది. హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

Hx-4127 Tel. A

సీరియల్

# డాక్టర్ వనిత

గంటి వెంకటరమణ

**జరిగిన కథ-12:** తల్లి యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వస్తుంది వనిత. రైల్లో తారసపడ్డ ఎమ్. కె. గాంధీ తన ఆందంతో వనిత హృదయంలో తిష్టవేస్తాడు. యామిని అన్న నరహరి. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్. తనను పెళ్ళాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొస్తాడు వనితకి. గతంలో... యామిని కిష్టం లేకపోయినా భగవన్నారాయణ రావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. తన మాటే నెగ్గాలనే రావ్ మనస్తత్వానికి ఎదురు తిరుగుతుంది యామిని. చదువుకోకపోవటం అనర్హతగా యామినిని వదిలి లండన్ వెళ్లిన రావ్ అక్కడ మరో పెళ్లి చేసుకుంటాడు. గోకుల్‌తో పెళ్లయిన వెంటనే అమెరికా వెళ్లిపోతుంది వనిత. గాంధీ తండ్రి పట్నాయక్‌గారు రాజకీయవాది. పట్నాయక్ ఆదరణలో పెరిగిన హరిజన యువతి కాదంబరి గాంధీని ప్రేమిస్తుంది. వనితకి వివాహ మయిందని తెలిసిన గాంధీ వ్యాకులత చెందుతాడు. గోకుల్ కోరుకునే సంఘ జీవనానికి అలవాటు పడలేకపోతుంది వనిత. తన ఎదుటే గోకుల్ పరాయి స్త్రీని చేరదీయటంతో వనిత మనసు విరిగిపోతుంది. గోకుల్‌ని వదిలి హైదరాబాద్ వచ్చేసిన వనిత కొడుకు నెహ్రూతో తండ్రి దగ్గర స్థిరపడుతుంది. పదేళ్లలో వనిత తల్లీ తాతగారు కాలగర్భంలో కలసిపోతారు. ఓరోజు నెహ్రూ తమ స్కూలుకి మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ వచ్చారనటంతో వనిత హృదయంలో అలజడి ప్రారంభమౌతుంది. గాంధీని కలుసుకుని తనతోబాటు ఇంటికి తీసుకువస్తుంది వనిత. వనితతోను, కాదంబరితోను తన పెళ్లి తప్పిపోవడంతో బ్రహ్మచారిగా వుండిపోతాడు గాంధీ. వనితకీ గాంధీకి పెళ్లి జరిపిస్తారు రావ్‌గారు. "నాకు మా నాన్నే కావాలి. నన్ను ఆయన దగ్గరకు పంపించండి" అన్న నెహ్రూ కోరిక తీరుస్తానని మాట ఇస్తాడు గాంధీ. తండ్రి గోకుల్ దగ్గరకి వెళ్లిపోతాడు నెహ్రూ. అక్కడి వాతావరణానికి అలవాటు పడలేకపోతాడు నెహ్రూ. రావ్‌గారి సహకారంతో తల్లికి తెలియకుండా హైదరాబాద్ వచ్చేస్తాడు నెహ్రూ. పబ్లిక్ స్కూల్లో మెట్రిక్ పూర్తిచేస్తాడు నెహ్రూ.

*(గత సంచిక తరువాయి)*

రావుగారు కారు డ్రైవ్ చేస్తూ ఒక్కసారి మనవడి మొహంలోకి చూశారు. ఆయన చెప్పబోయే మాటలు పెదవులు ఆపేశాయి. అయినా పెదవి విప్పి 'నెహ్రూ' అన్నారు.

ఆయన ఆ విధంగా పిలవడం నెహ్రూ యిదే మొదటిసారి వినడం. ఆయన గొంతులో బాధ, బ్రతిమాలే ధోరణి స్పష్టం అవుతున్నాయి.

రావుగారు భ్రుకుటి ముడి వేసి 'ఈ విషయం అంటే నువ్విలా యింత మంచి మార్కులతో పాసవడం వింటే నా వాళ్ళంతా పొంగిపోతారు. నువ్వు... నువ్వెందుకు నెహ్రూ నా గొంతు పెగల నీయవు ?' అన్నారు ఆవేశంగా.

నెహ్రూ విచారంగా మొహం పెట్టాడు. అతని సంతోషం ఒక్కసారి ఎగిరిపోయింది.

'మీ అమ్మ' రావుగారు చెబుతున్నారు. నెహ్రూ వినడంతో తనకేమీ సంబంధం లేనట్లే, 'నువ్వు వెళ్లిపోయావు. ఇల్లు స్మశానంలా మారిపోయింది. గాంధీ వేళకింత తిని పుస్తకాలు చేతిలో పట్టుకుని ఎక్కడెక్కడో తిరిగి తిరిగి యింటికి వచ్చేవాడు. మీ అమ్మ హాస్పటల్లో రోగులతో కాలక్షేపం చేసి యింటికి వచ్చేది. ఆమె నా మొహంలోకి కూడా సూటిగా చూడలేకపోయేది. జీవితంలో ఓడిపోయిన అభాగ్యురాలు. కంటికీ మింటికీ ఏకధారగా ఏడ్చేది ఒక్కో సమయంలో. ఆ దుఃఖాన్ని చూస్తూ నే నెందుకింకా బ్రతికివున్నానా అనుకునేవాడిని. 'నెహ్రూ' అని గోల పెడుతూంటే నా కడుపులో దేవినట్లయేది. ఆమెది వర్ణనాతీతమైన దుఃఖం. ఆ దుఃఖానికి నేనెలా వుపశమనం కలిగించను ?

'ఒక్కో రోజు అన్నం కూడా మానేసేది. ఎందుకని అడిగినప్పుడు నవ్వి 'వుపవాసాలు చేస్తే దేవుడు నా ఏడుపు విని కోరిక తీరుస్తాడు' అనేది

'పిచ్చి యిప్పుడేమైంది ? నెహ్రూ అతని తండ్రి దగ్గరేకదా వున్నది. నువ్వెందుకమ్మా భయ పడి ఏడవడం.'

'మీకు తెలియదు నాన్నగారూ. నెహ్రూ సుఖంగా వుంటాడా అక్కడ ? అనవసరంగా పంపించాము అని బాధపడేది.'

ఆమెకేం తెలుసు ? నువ్విలా యిక్కడే వున్నావని.

అప్పటికీ నెహ్రూ విననట్లే వూరుకున్నాడు.

'తల్లీ, తండ్రీ, రక్తసంబంధీకులు ఎవరు బాధపడ్డా దుఃఖపడేదే అసలైన మనిషి వ్యక్తిత్వం'

రావుగారు విసిరిన బాణం ఎవరిమీదకో నెహ్రూకి తెలుసు. అక్కడితో ఆ సంభాషణ ఆపేశారు. 'నీకేం చదవాలని వుంది నెహ్రూ' అని అడిగారు.

'అగ్రికల్చర్ బి. యస్ సి.'

రావుగారు విస్తుపోయినట్లు 'అదేం నువ్వు యింజనీరో, డాక్టరో కావాలనీ డాక్టర్‌వే అయితే నా తరువాత క్లినిక్ బాధ్యతలు నువ్వే చూస్తా వనీ అనుకున్నాను' అన్నారు.

'ఏమిటో తాతగారూ ఆ సబ్జక్ట్స్‌మీద నాకంత ఇంటరెస్ట్ లేదు. వ్యవసాయం చేయాలని వుంది.'

'అయితే నువ్వీ జన్మకే మీ అమ్మని చూడవా?' ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నెహ్రూ ఆ మొహంలోకి మరి కాసేపు చూడలేకపోయాడు. తల్లి అంటే అతనికీ ఎనలేని ప్రేమ వుంది. కానీ ఆ తల్లి... ఛ... అతని హృదయం జుగుప్సతో కుంచించుకుపోసాగింది.

కోఠీవైపు వస్తోంది రావుగారి కారు. పక్కనే మరో కార్లోంచి... నెహ్రూ ఆమెని సులభంగా గుర్తుపట్టాడు. ఇద్దరి కళ్ళూ క్షణంలో అరసగం మాత్రమే కలుసుకున్నాయి. అవి కార్ల వేగానికి విడిపోయాయి.

నెహ్రూ ఖంగారుగా 'అమ్మ చూసేసింది తాతగారూ' అన్నాడు.

'ఎవరూ?' అంతవరకూ దీర్ఘంగా ఆలోచిస్తున్న రావుగారికి నెహ్రూ నోట్లోంచి 'అమ్మ' అన్న పదం వినిపించగానే ఒళ్ళంతా సంతోషంతో పులకరించి నట్లయింది.

'అమ్మ చూసింది. మిమ్మల్ని తప్పకుండా అడుగుతుంది.'

'అడిగితే అడగనీ.'

'నా దగ్గరకి వచ్చేస్తుంది. నేను నలుగురిలో తలెత్తుకోగలనా ?'

రావుగారు కళ్ళద్దాలు సవరించుకుని కనుబొమలు చిట్లించి నెహ్రూ వైపు చూశారు. నెహ్రూలో స్వార్థమో, కుసంస్కారమో... లేదా తరతరాల హైందవ సంప్రదాయపు రక్తమో ఏది ఆక్రమించుకుందో అర్థం కావడంలేదు.

'మీరు నేను ఎక్కడ వుండేదీ చెప్పొద్దు.'

'ఐయామ్ సారీ నెహ్రూ. ఇన్నేళ్ళూ నేను నీ మాట విన్నాను. నువ్వూ పెద్దవాడివి అవుతున్నావు. కొంత వయసు వచ్చాక కొడుకు ఫ్రెండ్‌తో సమానం అంటారు. నువ్విప్పుడు నాకు అంతకంటే ఎక్కువే. నీకో సంగతి చెప్పడానికి నేనేమీ సిగ్గుపడను. మీ అమ్మ బలవంతంగా రెండు సార్లు అబార్షన్ చేయించుకుంది.

గాంధీ గురించి చెప్పేందుకు నా దగ్గర మాటల డిక్షనరీ లేదు. నీకూ ఆ బిడ్డకూ మధ్య యిటువంటి భేదమే వస్తుందని ఆమె ఆ పని చేసింది. వనిత సుఖమే తన లక్ష్యం అనుకున్న గాంధీ ఒక్క మాట అనలేదు. ఆఖరికి అతనే ఆపరేషన్ చేయించుకున్నాడు.

'ఎప్పుడైనా నిన్ను చూడగలనా అనే స్థితికి వచ్చింది వనిత. ఇప్పుడామె నిన్ను చూడడం నాకు

చాలా సంతోషంగా వుంది.' అని తలెత్తి చూశారు.

నెహ్రూ కళ్ళల్లో నీళ్ళు చోటుచేసుకున్నాయి. కారు తాజ్‌మహల్ హోటల్‌లోకి వచ్చింది. మాటల మధ్య ఎబిడ్స్ దాటడం రావుగారు గమనించలేదు. రూఫ్ గార్డెన్‌లోకి వెళ్ళి ఓ చోట కూర్చున్నారు. నెహ్రూ గంభీరంగా మారిపోయాడు అతనికి దుఃఖం వుప్పెనలా వుబికి వస్తోంది.

'ఏం కావాలి ?' రావుగారు అడిగారు.

'మీ యిష్టం.'

'అదేం ... అరె నెహ్రూ నీకేం కావాలో చెప్పు. ప్లీజ్ యిక్కడ నువ్వు కన్నీళ్ళు పెట్టుకుంటే అందరూ చూస్తారు ప్లీజ్ ... ప్లీజ్...'

నెహ్రూ నవ్వి 'మీయిష్టం. ఏం తెప్పించినా తింటాను. మీరు...' ఆ తరువాత అతను మాట్లాడలేదు. కానీ మనసులో కసిగా అనుకున్నాడు. 'ఈ శరీరం అణువణువూ మీ పైసాతో పెరిగింది. ఇప్పుడు నాయిష్టం అంటూ ఏముంది.'

కాఫీ త్రాగి టిఫెన్ తీసుకోకుండానే బయటికి వచ్చేశారు యిద్దరూ. హుస్సేన్‌సాగర్ దాటి బోట్స్ క్లబ్‌లో ఆగింది కారు.

ఆయన బేరర్‌ని పిలిచి విస్కీకి ఆర్డర్ యిచ్చారు. నెహ్రూ శాండ్‌విచెస్ తింటూ దూరంగా వెళ్ళే రైలుబండినీ, నౌబత్‌పహాడ్‌నీ చూస్తున్నాడు. రావుగారు విస్కీ అందుకుని సిప్‌చేసి 'నిన్ను హాస్టల్లో దింపేస్తాను. మళ్ళీ ఎప్పుడు రమ్మంటావు ?' అని అడిగారు.

'ఒద్దు. మీరు యిప్పుడే రావద్దు. నేను వుత్తరం రాస్తాను.' అన్నాడు నెహ్రూ. ఆ తరువాత యిద్దరూ మాట్లాడుకోలేదు చాలాసేపటివరకు. నెహ్రూ వాచీ చూసుకుంటున్నాడు. రావుగారు గమనిస్తూనేవున్నారు. ఎనిమిదిగంటల ప్రాంతంలో నెహ్రూని హాస్టల్లో వదిలి ఇంటికి వచ్చేశారు.

*   *   *

'ఇవాళ నెహ్రూని చూశానండీ నేను.' అంది వనిత. ఆమె కంఠంలో సంతోషం కట్టలు తెంచుకున్న నదీ ప్రవాహంలా వుంది.

'ఈజ్ యిట్ !' నమ్మలేనట్లు అడిగాడు గాంధీ.

'నిజం ! ఎక్కడో అయితే నమ్మకపోయేదాన్ని. నాన్నగారి కారులో నాన్నగారి పక్కనే కూర్చుని కోఠీవైపు వెడుతూ కనిపించాడు.'

'అచ్చా ! ఓ పని చేస్తే. మీ నాన్నగారిని అడుగు ఎక్కడ వున్నాడో ?'

'ముందు మీకీ విషయం చెప్పాలని వచ్చాను. ఇప్పుడే వెళ్ళి అడుగుతాను. ఆయన ఎప్పుడు వస్తారా అని ఎదురుచూస్తున్నాను చాలాసేపటి నుంచి.' వనిత గదిలోంచి బయటికి రాబోయింది. గది గుమ్మందగ్గరే రావుగారు ఎదురయ్యారు. వనిత అడుగు వెనక్కి వేసింది. వనిత వెనుకే రావుగారు ఆ గదిలోకి వచ్చారు. గాంధీ కుర్చీలోంచి లేచి వెళ్ళి రావుగారిని లోపలికి తీసుకువచ్చి ఆయన కూర్చున్నాక తనూ కూర్చున్నాడు.

రావుగారు ఐదేళ్ళ నుంచీ దాచుకున్న రహస్యం చెప్పడం మొదలుపెట్టారు : 'నిన్న నెహ్రూ చూశానని చెప్పాడు వనితా !'

నెహ్రూ అమెరికా వెళ్ళిన కొన్ని రోజులకే నాకు వుత్తరం వ్రాశాడు తను అక్కడ వుండలేనని. తనని రహస్యంగా ఎక్కడైనా వుంచి చదివించమని మరీ మరీ రాశాడు.

నెహ్రూ చాలా పట్టుదల పిల్లవాడు. ఆ పిల్లడిని నయానా, భయానా మార్చాలని చాలా ప్రయత్నం చేశాను. కానీ నావల్లకాలేదు. నీ పేరే ఎత్తడు. ఈ ఐదేళ్ళలోనూ సాయంత్రం విన్నాను తాతగారూ అమ్మ కనిపించింది అనడం.

అగ్రికల్చర్ బి. యస్‌సి. చదువుతాడుట. తనకీ ప్రొఫెషనల్ కోర్సులు యిష్టంలేవుట. తల్లీ పిల్లల మధ్య ఉండే ప్రేమ విషయం ఎంతో నచ్చ చెప్పాలని ప్రయత్నం చేశాను. బేవకూఫ్‌ని అయ్యాను. నామాటే వినడే ...'

గాంధీ ఆయనవైపు చూసి 'నాకు తెలుసు. నెహ్రూ మొదటినుంచీ నన్ను హేట్ చేస్తున్నాడు. ఏదోవిధంగా నేనతనికి దగ్గరవాలనుకున్నాను. చివరికి తల్లికి కూడా దూరం అయిపోయాడు.

వనిత ఏడుస్తోంది. ఆమె మనసులో ఒకవైపు నెహ్రూ మరోవైపు గాంధీ వున్నారు. యిద్దరూ తనకి కావాలి. మరి తను... గాంధీ జాలిగా చూస్తున్నాడు. నెహ్రూ కూడా తనవైపు జాలిగా చూస్తున్నాడు. ఎవరిని వదులుకోగలదు ?

కన్నబిడ్డ కోసం తన తల్లి మేనమామల యింట చేరి పెంచి పెద్ద చేసి కళ్ళల్లో వొత్తులు వేసుకుని తనని తాను నిర్లక్ష్యం చేసుకుని బ్రతికింది. తను... కేవలం స్వార్థమేనా... తల్లిమాదిరి తను ఎందుకు వుండలేకపోయింది. గాంధీతో జీవితం ఎందుకు ముడి పెట్టుకోవలసివచ్చింది ?

'నేను వెళ్ళి అతన్ని కలుసుకుంటాను మావయ్యగారూ. నెహ్రూ ఎక్కడ వున్నాడు ?'

రావుగారు చెప్పారు.

గాంధీ తల పంకించి ఆలోచించసాగాడు. ఆ రాత్రి ఎవరికీ నిద్రపట్టలేదు. అందరి ఆలోచనల్లో నెహ్రూ తిరుగుతున్నాడు.

*   *   *

'మీరా' నెహ్రూ నిర్ఘాంతపోతున్నవాడిలా అడిగాడు.



గాంధీ అతనితో నెమ్మదిగా అన్నాడు: 'మనం అలా బయటికి వెళ్ళివద్దాం వస్తావా నెహ్రూ.'

నెహ్రూ అతనివైపు చూసి 'అలాగే' అని 'ఒక్క నిముషం' అని లోపలికి వెళ్ళి ఐదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు.

'మనం ఎక్కడికి వెడదాం?' నెహ్రూ అడిగాడు.

'నీ యిష్టం' గాంధీ అన్నాడు.



★...★ ★...★ ★...★ 'ముత్యాల పల్లకి'లో జయసుధ ★...★ ★...★ ★...★

'పదండి మీ యింటికి వెడదాం' నెహ్రూ కార్లో కూర్చుంటూ అన్నాడు. కారు నెమ్మదిగా వెళ్ళిపోతోంది. గాంధీ చాలాసేపటికి నోరు విప్పి నెమ్మదిగా అన్నాడు: 'నువ్వు హాస్టల్ వదిలి మీ అమ్మతో వుండు. మీ అమ్మకి నువ్వు కావాలి. నేను ఎక్కడికైనా వెళ్ళిపోతాను.'

నెహ్రూ చిత్రంగా నవ్వాడు. అంత చిప్పి నయమంలో ఆ నవ్వులో ఎంతో వ్యంగ్యం వినిపిస్తోంది. గాంధీ నిబ్బరంగా అతనివైపు చూసి: 'నేనేమీ పరిహాసం ఆడడంలేదు' అన్నాడు.

'తెలుసును' తలబిరుసు కుర్రాడిలా అన్నాడు నెహ్రూ.

ఇల్లు చేరుకునేసరికి యింట్లో ఎవరూ లేరు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. గాంధీ తన గదిలోకి తీసుకువెళ్ళి నెహ్రూని మంచంమీద కూర్చోమని తను బట్టలన్నీ సర్దుకుంటూండిపోయాడు.

నెహ్రూ శరీరం భయంతో వణికిపోతోంది. చేతులు చెమటతో తడిసిపోతున్నాయి. పగా ప్రతీకారం అతని విచక్షణాజ్ఞానాన్ని హరింపచేస్తున్నాయి.

అతని చేతిలో తళ తళ లాడుతోంది చాకు. అది ఫారిన్ వెళ్ళినప్పుడు యాపిల్ కోస్తూ ఆలోచించాడు. యాపిల్ ఆకృతి గాంధీలాగా కనిపించింది. అప్పట్లో ఆ యాపిల్‌నే కసిగా చెక్కేశాడు. నవ్వుతూ నవ్వుతూ ఆ చాకు ఒక్కసారి తెచ్చుకున్నాడు.

అతని కళ్ళు నిప్పు కణికల్లా వున్నాయి. తెల్లని మొహం ఎరుపు రంగుని పులుముకుంది. అతనికి ఎదురుగా వున్న గాంధీ తల్లిని వాటేసుకుని గాఢంగా కౌగిలించుకున్న దృశ్యమే కనిపిస్తోంది. తన తల్లికీ, తనకీ అపకీర్తి తీసుకువచ్చిన కారణభూతుడిగా కనిపిస్తున్నాడు. అతని ఆలోచనలు పెడత్రోవ పోతున్నాయి. గాంధీ యిటు తిరిగి నిశ్చేష్టుడయ్యాడు.

నెహ్రూ ప్రళయకాల రుద్రుడిలా కనిపిస్తున్నాడు గాంధీ కంటికి. భయంతో కనుబొమ్మలు ముడుచుకుపోసాగాయి. చాకుని కంటి దగ్గర్నుంచి చెవి వరకూ తీసుకువెళ్ళాడు నెహ్రూ. అది విసిరేందుకు క్షణంలో అరసగంసేపు పట్టుదు.

గాంధీ తన తరఫునుంచి ఆత్మరక్షణ చేసుకునే ప్రయత్నం చేయలేదు. అతనికి కాలం స్తంభించినట్లు అనిపిస్తోంది. మెదడు పనిచేయడం మానేసింది. ఎదురుగా మృత్యువు వికటాట్టహాసం చేస్తోంది. కోరి మృత్యువు వాకిలి తలుపు కొట్టాడు. కళ్ళు మూసుకున్నాడు గాంధీ.

నెహ్రూ చేతిలో చాకు అతని శరీరంలోకి దూసుకుపోయింది.

గుమ్మంలో నిలుచున్న వనిత దిగ్భ్రాంతురాలైంది నోట మాట రాక. ఆమె నోట మాట రావడంలేదు.

గాంధీ కేక ఆ యింటిని ప్రతిధ్వనింపజేస్తూ వినిపించింది. ఆ కేకకి ఎక్కడివారూ పరిగెత్తుకుని అక్కడికి వచ్చారు.

అల్లకల్లోలమైపోయింది వాతావరణం. రావుగారు పరిగెత్తుకు వచ్చారు. మనిషి ప్రాణం తీయడం సులభమేకానీ రక్షించే యత్నంలో మనిషి యంత్రంలా మారిపోతాడు.

* • *

హాస్పటల్లో కళ్ళు తెరిచాడు గాంధీ. అతని చుట్టూ బంధువర్గం, పరివారం. అతని కళ్ళు ఆతృతగా పరికిస్తున్నాయి.

పోలీసులు, ఇన్‌స్పెక్టర్నూ అతని వైపు అతనికంటే ఎక్కువ కుతూహలంగా చూస్తూ 'చెప్పండి మీరు...అతను మిమ్మల్ని చంపే ప్రయత్నం చేశాడు. అవునా!' ఇన్‌స్పెక్టరు రిపోర్టు రాసుకునే ప్రయత్నంలో వున్నాడు.

వనిత అతనివైపు చూసింది. గాంధీ నవ్వి దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఇన్‌స్పెక్టర్ తొందరచేయసాగాడు.

గాంధీ నవ్వి 'భలేవారే ఇన్‌స్పెక్టర్‌గారూ! ఎక్కడైనా తండ్రిని కొడుకు చంపుతాడా?' అన్నాడు.

ఆ తరువాత ఇన్‌స్పెక్టర్ ఏమీ మాట్లాడలేకపోయాడు.

రావుగారు కళ్ళు తుడుచుకోసాగారు. గాంధీ తలవైపు కూర్చున్న వనిత అతని జుట్టులోకి వ్రేళ్ళు పోనిచ్చి నిశ్శబ్దంగా 'థాంక్స్...థాంక్యూ డియర్!' అనుకోసాగింది.

గాంధీ ఆమె వైపు చూస్తూ 'నెహ్రూ ఏడీ?' అని ప్రశ్నించాడు.

## డాక్టర్ సలహాలు * —డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

ని. వి. ఆర్. — మద్రాసు

నాకు పాస్‌కి మామూలుగా కాకుండా రోజుకి 15 సార్లయినా వస్తుంది. రాత్రి భోజనమయిన తర్వాత 5 ని.ల కొకమారు వస్తుంది. రంగు తెల్లగానే వుంటుంది. పాస్‌కి పోయేటప్పుడు కొంచము ఎక్కువగా ఉగ్గబెట్టవలసి వుంటుంది. ఇలా నాలుగు నెలల నుండి వుంటోంది.

★ పలుమార్లు — మూత్ర విసర్జన జరగటానికి, అందులోనూ మూత్ర విసర్జనా సమయంలో కాస్త శ్రమ (ఉగ్గ) పడవలసి రావటం అనే అంశం ఉండటంవల్ల; కారణం సులువుగా ఊహించవచ్చు.

మూత్ర విసర్జనా ద్వారంలో మార్గావరోధం ఏర్పడినా, మూత్రాశయపు గోడలలోని కండరాలకి వెళ్లే నరాలు సరిగా పనిచేయకపోవటంవల్ల మూత్రాశయం పూర్తిగా మూత్రాన్ని వెలువరించలేకపోయినా ఇలా జరుగుతుంది. ఎందుకంటే, కొద్ది కొద్దిగా పలుసార్లు విసర్జించే అవసరం ఏర్పడుతుందిగనక, దీనికి — ద్వారబంధంగాని, మార్గావరోధంగాని ఉన్నదో లేదో శస్త్ర చికిత్స వైద్యులు "చిన్న ఆయుధం" (ట్యూబ్)వాడి కనుగొంటారు. అవరోధం ఉంటే 'శస్త్ర చికిత్సే శరణ్యం అవుతుంది.

ని. ఎస్. — ఏలూరు

మా అమ్మాయి వయస్సు 14 సం.లు. మొదట కడుపునొప్పికి 'మోషన్ టెస్టు' చేయిస్తే 'టేప్ వర్మ్' వుందని తేలింది. దానికి 15 రోజుల కొకసారి ఒక మాత్ర యిచ్చి పగలు విరోచనాల మందు వేయమన్నారు. ఇలా 5 మార్లు యివ్వటమైనది కాని పాము పూర్తిగా పడలేదు. ముక్కలు పడుతున్నవి. పిల్ల నీరసపడిపోతున్నది. దీనికి సరైన మందు ఏమైనా వున్నదా ?

★ "ఫెలిక్స్ మాస్" అనే మందు క్రమబద్ధంగా వైద్య పర్యవేక్షణతోను 10 రోజుల ముందు నుంచే లివర్ దెబ్బతినకుండా "గ్లూకోజ్" మొ.వి వాడిగాని యివ్వకూడదు. అందులోనూ ఒకసారికీ మరొకసారికీ మధ్య కనీసం 1 నెల వ్యవధి విధిగా అవసరం. పై సూచనల ప్రకారం ప్రస్తుతానికి ఆ "టేప్ వర్మ్" తో పోరాటం ఆపి మంచి ఆహారం మొ.వి వాడి ఆరోగ్యం మెరుగు పరచండి. 2 నెలల తర్వాత తిరిగి ప్రయత్నించండి.

ఎ. వి. — పొన్నూరు

నాకు కుడి చేతిమీద కుక్క కరిచినది. దాని వంటినిండా గజ్జి వున్నది. అది పిచ్చికుక్క కాదు. 'టెటనస్ టాక్సైడ్' ఇంజక్షన్, యాంటిబయాటిక్ ఇంజక్షన్ చేయించినాను. నేను ఇప్పుడు 'యాంటిరేబిస్' ఇంజక్షను చేయించాలనుకుంటున్నాను. ఈ సమయములో ఏమైనా పత్యము చేయవలెనా ?

★ "యాంటీ రేబిస్" ఇంజక్షన్ (వాక్సిన్) వేయించుకొనే సమయంలో పత్యం చేయవలసిన అవసరం ఎంతమాత్రమూ లేదు. అసలు యీ వాక్సిన్ — కుక్కకి గజ్జి వున్నంత మాత్రాన వేయించుకోవటం అవసరమా అని ఆలోచించండి.

ఎ. ఎస్. — అనకాపల్లి

నా వయస్సు 26 సం.లు. నాకు 20 నెలల క్రితం టి. బి. వచ్చినది. మందులు, ఇంజక్షనులు వాడాను. ఇప్పుడు ఆపివేయవచ్చా ? టి. బి. వచ్చినవాళ్లు మాంసము, గుడ్లు ఎక్కువ తినవలెనా ? ఎందువల్ల ?

★ క్షయరోగం (ట్యుబర్క్యులోసిస్) వచ్చినవారు కనీస పక్షంగా ఒక సం. పాటు విధిగా వైద్యులు నిర్ణయించిన మందులను క్రమం తప్పక వాడితీరాలి.

కాని కొందరికి, రోగ స్థితిని బట్టి, వారు మొదటి సం.లో మందులను సరిగ్గా వాడకపోవడం వల్ల యీ 12 నెలల గడువుని అవసరాన్నిబట్టి, వైద్యులు పెంచటం లేక మందులు మార్చి గడువు పెంచటం చేస్తారు. మీరు మందులు ఆపటం విషయంలో మీకు ముందుగా మందులు వ్రాసి యిచ్చినవారిదే బాధ్యత.

క్షయ రోగులకు — ఆ రోగం పేరులోనే అర్థం వున్న—క్షీణించిపోవటం—అనేదాని కొరకై బలిష్టం అయిన ఆహారాన్ని తీసుకోమంటారు. మాంసం, గుడ్లు తింటేనేగాని నయమవదని యెక్కడాలేదు. ఎక్కువ ప్రొటీన్లు గల ఆహారం తీసుకోవాలి అవి ఏ రూపంలో అయినా సరే.

టి. ఎమ్. — అన్నంగి

మా తాతగారి వయస్సు 60 సం.లు. కొంచము దూరము నడచిన నీరసము వస్తుంది. ఎన్ని మందులు వాడినను తగ్గలేదు. ఏమి చెయ్యమంటారు ?.

★ 60 సం.ల మీ తాతగారికి కొంచెం దూరం నడిస్తే నీరసం వచ్చిందంటే — నాకు ఒకవైపున ఆశ్చర్యంగాను — ఇంకొకవైపు సానుభూతిగాను మాత్రమే అనిపిస్తున్నది. ఎందుకంటే ప్రస్తుత "నాగరిక" ప్రపంచంలో, అణుయుగంలో 25వ సం. దాటగానే కీళ్ళనొప్పులు — శ్రమించి పని చేయలేకపోవటం జరుగుతుంటే, మీ తాతగారికి 60 సం. వయస్సులో నడిస్తే "నీరసం" మాత్రం వస్తున్నందుకు మీ తాతగారి శరీర పటుత్వమే ఒక కారణం. ఇలా చెప్పటానికి కారణం — మన దేశంలో పుట్టినప్పుడు ఒక వ్యక్తి సరాసరి 53 సం.లు మాత్రం బ్రతకగలడని గత 23 సం.లలో తెలిసింది. మందులు పని చేయకపోవటానికి వయస్సు మీరినందువల్ల వచ్చిన ప్రకృతిసిద్ధ లక్షణమే. ●

---

## డాక్టర్ వనిత

వనిత కళ్ళల్లో నీళ్ళు చేరుకున్నాయి. రావుగారు చెప్పారు. 'నా స్నేహితుడు తన ఇంటికి తీసుకువెళ్లాడు. నెహ్రూ స్వతహాగా మంచివాడే గాంధీ. ఆ పిల్లడికి ఎన్ని మెడల్స్, ఎంత పేరూ స్కూల్లో. నేను అతిశయోక్తులు చెప్పడంలేదు. నిజం.'

'నాకు తెలుసునండి.' గాంధీ మృత్యుముఖం నుంచి తప్పించుకున్న తరువాత రెండు నిమిషాలు మాట్లాడాడు మనసు విప్పి.

'ఉపన్యాసాలు యిస్తారు వేదిక లెక్కిన ప్రతి వ్యక్తులూ. ఆచరణలోకి రాగానే ఆ ఉపన్యాసాలు గాలివాటుకి ఎగిరిపోతాయి. తల్లి పట్ల అతనికి కలిగిన యీ దురభిప్రాయానికి కారకులు మన సమాజం సర్ !'

'మారిపోతోందీ సమాజం అని ప్రగల్భాలు పలికేవారేకానీ స్త్రీ జీవితాన్ని సానుభూతితో అర్థం చేసుకునేవారెంత మంది వున్నారు ? వనితని ఎవరైనా చేరదీయగలిగారా ? మగవాడు పెళ్లి చేసుకుంటే సమర్థించే సమాజం కన్నకొడుకు ముందు ఆమెని పతితగా, కళంకినిగా తీర్చి ఆ పసిహృదయంలో వేసిన ముద్రకి ఫలితం ఎంత దారుణంగా వుంటుందో చూడండి.'

'ఎక్కడుందీ మానవత్వం ? ఈ ప్రపంచం అణు యుగంలో అడుగు ముందుకువేసినా అనాదిగా వస్తున్న పతివ్రత కథల్ని మాత్రం ఒక్క క్షణం కూడా విస్మరించదు.'

'నెహ్రూ మంచివాడని వేరే చెప్పాలా? అతనికి నామీద ద్వేషానికి రెండు కారణాలు. అతను తల్లి తండ్రుల ప్రేమకి నోచుకోలేదు. తల్లి ప్రేమకి మధ్యలో ఈ విధంగా గ్రహణం పట్టింది. తండ్రి ఆ విధంగా నిర్లక్ష్యం చేస్తే అతని మనసు విప్లవానికి దారి తీయదా ?'

'ఈ నగ్నసత్యాలు తెలుసుకోవాలంటే అతను మానసికంగా శారీరకంగా యింకా పెరగాలి. సమాజంలో అతను తన వ్యక్తిత్వం గుర్తుపట్టగలగాలి. చైతన్యం వచ్చి అతను కదలాలి. మనం వుగ్గుపాలతో నేర్పినా కాలం యిచ్చే తీర్పు ముందు వుంది.'

'ఏ సూత్రాలూ, ఏ ప్రణాళికలూ మనిషిని చట్టానికి అనుగుణంగా మార్చగల్గినా అవి తాత్కాలికంగా జరిగే మార్పులే. స్త్రీని వుద్ధరించే సిద్ధాంతాలకి మాత్రం సమయం రావాలి.'

'నువ్వు ఎక్కువ మాట్లాడకు ప్లీజ్. రెస్ట్ తీసుకో గాంధీ.'

'అచ్చా' అతను కళ్ళు మూసుకున్నాడు నిద్రపోయేందుకు. ●

---

**అంకితం**

నా ఆరాధ్య దైవం శ్రీ వేంకటేశ్వర స్వామివారి పాదపద్మములకు.

భక్తితో

*గంటి వెంకటరమణ.*

# (•) సినిమా విశేషాలు (•)



'ఇంటిని దిద్దిన ఇల్లాలు'లో జయసుధ

### తెలుగుతెర కొక కొత్త కవి

మన చిత్ర రంగంలో ఎందరో కవులు వున్నారు. ఆ కవులందరినీ, మన నిర్మాతలు ప్రోత్సహిస్తూనే వున్నారు. తెలుగు తెరకు మరొక కవి పరిచయం అవుతున్నారు.

ప్రముఖ దర్శకుడు ప్రత్యగాత్మ, ద్వారకా ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత రాఘవేంద్రరావు, విఖ్యాత సంగీత దర్శకుడు చలపతిరావు ఒక "కవి"ని నెల్లూరు నుంచి పిలిపించి, ఆయనచేత రెండు పాటలను వ్రాయించారు. ఆ కొత్త కవి పేరు నాగభైరవ కోటేశ్వరరావు. ఆయన వ్రాసిన రెండిట్లో ఒకదాన్ని పాఠకులకు తెలుపుతాను.

"కోడిపుంజు కోకోకో
కోకిలమ్మ కూకూకూ
ఈడువచ్చి ఈలవేస్తే
జోడుకోసం సైసై."

పై పాటను పరికిస్తే, మనకు ఒక నిజం బోధపడుతుంది. (కొత్త కవి గారి కలం అందరికీ అందుబాటులో వుండే పదములను యిస్తుంది.)

### ద్వారకా ఆర్ట్ ప్రొడక్షన్స్

మదరాసులో వెలసిన నూతన చిత్ర నిర్మాణ సంస్థ. ఈ సంస్థ ఒక ప్రయోజనాత్మక చిత్రాన్ని తలపెట్టింది. ప్రముఖ దర్శకుడు ప్రత్యగాత్మను ఎంపిక చేసింది.

జనవరి ఆర్నుంచి షూటింగు ప్రారంభమయ్యే ద్వారకా ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి చిత్రానికి బొల్లిముంత కథ, మాటలను సమకూర్చారు.

### సుధామోహన్ !

ప్రత్యగాత్మ దర్శకత్వంలో, చలపతిరావు సంగీత సారథ్యంలో, కృష్ణారావు ఛాయాగ్రహణంలో, సురేష్ సహ దర్శకత్వంలో తయారయ్యే డి. ఎ. పి. వారి చిత్రంలో మురళీమోహన్, జయసుధ, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. ఈ చిత్రంలో "కళావాచస్పతి" జగ్గయ్య ఒక ముఖ్య భూమికను ధరిస్తున్నారు. నిర్మాతలు: రాఘవేంద్రరావు, వెంకటేశ్వరరావు.

### పది రీళ్లు వచ్చిన న్యాయం

శ్రీ లలితా మూవీస్ దాసరి దర్శకత్వంలో నిర్మిస్తున్న "ఇదెక్కడి న్యాయం" చిత్రం సగానికి పైగా పూర్తయింది. పది రీళ్ల చిత్రాన్ని యీ విలేఖరి చూశాడు.

ప్రతి షాటు ప్రశంసనీయంగా వుంది. దాసరి వ్రాసిన ప్రతి మాటకు ప్రేక్షకులు క్లాప్స్ కొట్టగలరు. బిగువయిన కథ వుంది. మురళీమోహన్, జయసుధ, ప్రభ, మోహన్‌బాబు, జయమాలిని, నరసింహరాజు చక్కగా నటించారు. "ఓల్డ్ గెటప్"లో మురళీమోహన్, ప్రభ చాలా బాగా రాణించారు.

"ఇదెక్కడి న్యాయం" చిత్రంలో రాజేశ్వరరావు గారి సంగీతం మధుర మధురంగా వుండడం ఎంత నిజమో, మణిగారి ఛాయాగ్రహణం అంత బాగుందని వ్రాయడం న్యాయం అవుతుంది.

నిర్మాత జగదీష్‌చంద్రప్రసాద్‌గారికి, దాసరి గారు "ఇదెక్కడి న్యాయం" చిత్రం ద్వారా ధన న్యాయం చేకూర్చడం తథ్యము అనిపించింది.

### డి. వి. ఎస్. అవుట్‌డోర్

ప్రముఖ చిత్ర నిర్మాత డి. వి. ఎస్. రాజుగారు తన కొత్త కలర్ చిత్రం తాలుకు అవుట్‌డోర్ షూటింగును రాజమండ్రిలో యిరవై రోజులు పూర్తిచేశారు.

ఇరవై రోజులు జరిగిన షెడ్యూలులో రెండు రోజులు మాత్రం సూర్యుడి శాపానికి గురి అయినట్లు, మిగతా రోజులు సూర్యుడి అనుగ్రహానికి పాత్రమైనట్లు, నిర్మాత రాజుగారు చెప్పారు.

రావులపాలెం (రాజమండ్రి దగ్గర) షెడ్యూలులో శోభన్‌బాబు, జయసుధ, జయప్రద, రాజబాబు, ముక్కామల, త్యాగరాజు పాల్గొన్నారు.

"అవార్డు దర్శకుడు" విశ్వనాథ్‌గారి నిర్దేశకత్వంలో రూపొందుతున్న డి. వి. ఎస్. రాజుగారి రంగుల చిత్రం అందరినీ అలరించే అర్హతను బడసియుంది.

"హి–మాన్" పాత్రలో ప్రత్యేకత వుంది. మహదేవన్‌గారి బాణీలలో గిలిగింత వుంది.





'చక్రధారి'లో వాణిశ్రీ, అక్కినేని, అల్లు, రమాప్రభ

'ఈతరం మనిషి'లో లక్ష్మి



### శ్రీ శ్రీ రచించిన రెండు

ఉత్తేజాన్ని, ఉద్వేగాన్ని, ఉత్సాహాన్ని ఒక పదంలో యిమడ్చగల శక్తి "శ్రీశ్రీ" కలానికి వుంది. ఆయన వ్రాసే ప్రతి పాట (దాదాపు) హిట్ అవుతూనే వుంది.

ఇటీవల ఆయన వ్రాసిన రెండు పాటలను యీ విలేఖరి విన్నాడు. ఒకటి : ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ వారి "ఆలుమగలు" చిత్రానికి. మరొకటి : అన్నపూర్ణా పిక్చర్స్ వారి "ప్రేమలేఖలు" చిత్రానికి. రెండు పాటలకు గల వైవిధ్యం పాఠకులకుతెలపనా?

"ఆలుమగలు" చిత్రంలోని పాట :

"తెలుసుకో యీ జీవిత సత్యం
జరిగేదే ఇది ప్రతి నిత్యం
ఏ వయసునకా చోటుంది
అక్కడే నీకు పరువుంది
అప్పుడే నీకు సుఖముంది." ఈ పాటకు చలపతిరావు సమకూర్చిన బాణీ ఎంత గొప్పదో. బాలు పాడిన విధానం అంత మెచ్చదగినది. (ఈ పాటను అక్కినేని ... వాణిశ్రీగార్ల మీద దర్శకుడు తాతినేని రామారావు చిత్రీకరించారు. నిర్మాత ఎ. వి. సుబ్బారావు.)

"ప్రేమలేఖలు" చిత్రంలోని పాట :

"ఈరోజు మంచిరోజా
ప్రేమ సుమం వికసించిన రోజా." ఈ పాటకు సత్యం సమకూర్చిన బాణీ గొప్పదా, పాడిన సుశీల ... వాణీజయరామ్ గొప్పవారా అని తేల్చడం అంత సులభం అనిపించదు. (ఈ పాటను జయసుధ ... దీపలపై దర్శకుడు రాఘవేంద్రరావు చిత్రీకరించారు. నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు.)

### లక్కీ జయసుధ !

"లక్ష్మణరేఖ" చిత్రం జయసుధ గీతను మార్చింది. "జ్యోతి" చిత్రం ఆమెకు అనూహ్యమైన అంతస్తును ఆర్జించిపెట్టింది.

దుక్కిపాటి మధుసూదనరావుగారి "ప్రేమలేఖలు" చిత్రం జయసుధ జీవితంలో కొత్త అధ్యాయాన్ని సృష్టిస్తుంది.

జయసుధకు యింత డిమాండు రావడానికి అదృష్టం ఒక్కటే కారణం కాదు. ఆమెకుగ్లామరు నిచ్చిన దేవుడు, నటనా ప్రతిభను కూడాయిచ్చాడు.

అగ్రనటి అయ్యే అవకాశాలు యిప్పుడిప్పుడే వస్తున్నాయి. పాత్రల ఎంపికలో జాగర్త వహించ గలిగితే, భవిష్యత్తులో జయసుధ అగ్రస్థానాన్ని ఆక్రమించడం తధ్యం.

'జన్మజన్మల బంధం'లో వాణిశ్రీ, గుః





'సీత గీత దాటితే?'లో కవిత, శ్రీధర్

### నందమూరి ప్రమోషన్

నందమూరి వంశంలో వృద్ధిలోకి రావలసిన ప్రతిభావంతుడు ఒకరున్నారు. ఆయన పేరు రమేష్. "నటరత్న" గారి రెండు భారీ వర్ణ చిత్రాలకు రమేష్ సహాయకుడుగా చూపిస్తున్న శ్రద్ధ, శ్రమను అభినందించడం యీ కలం గర్వంగా భావిస్తుంది.

"శ్రమజీవి, ప్రతిభాశాలి" అగు నందమూరి రమేష్‌కు కొత్త సంవత్సరంలో కొత్త పదవి లభించ బోతూంది.

ఎన్టీఆర్ ఆశీర్వాద బలంతో, రమేష్ ఒక భారీ వర్ణ చిత్రానికి దర్శకుడుగా పదవీస్వీకారం చెయ్యబోతున్నారు.

ఆ చిత్రం పేరు "మా ఇద్దరి కథ." నిర్మాత పేరు కె. గోపాలకృష్ణ. ("కథానాయకుడు" నిర్మాత.) ఈ వర్ణ చిత్రంలో "నటరత్న" వైవిధ్యం వున్న అన్నదమ్ముల పాత్రలను పోషించడం గమనించదగ్గ విషయం.

ఒక పాత్ర రాముడికి ప్రతినిధి అయితే, మరొక పాత్ర కృష్ణుడికి ప్రతిరూపంగా వుంటుంది. "రేజర్స్ ఎడ్జ్ క్యారెక్టర్స్" అన్న మాట.

### ఎన్టీఆర్ నుంచి మరొక సంచలన పాత్ర

పురాణ పాత్రలను పోషించడంలో "ఎన్టీఆర్" అద్వితీయుడు అని అనేకసార్లు ఋజువయ్యింది. ఆయన ధరించిన "భీష్మ ... భీమ ... రామ ... రావణ ... కృష్ణ ... ఈశ్వర ... సుయోధన" పాత్రలు ప్రేక్షకుల మనసులో చెరగని ముద్ర వేశాయి.

"అద్వితీయుడు" ఎన్టీఆర్ మరొక పురాణ పాత్రను అంగీకరించారు. అదేమిటనః యమధర్మరాజా పాత్ర.

"లవకుశ" ఫేమ్ శంకరరెడ్డి నిర్మిస్తున్న "సావిత్రి" వర్ణ చిత్రంలో ఎన్టీఆర్ యముడుగా ఒప్పుకోవడం, ప్రేక్షకులకు అమితానందాన్ని అందిస్తుంది. ఎందుకంటే? యమధర్మరాజు పాత్రకు పూర్తి న్యాయం చెయ్యగల విగ్రహశుద్ధి, వాక్శుద్ధి ఎన్టీఆర్‌కు మాత్రమే కలదన్నది యీ కలం అభిప్రాయం.

"సావిత్రి"గా అగ్ర నటి నటించగలదని తెలుస్తూంది.

### బంగారక్క తర్వాతేమిటి?

రవి శంకర్ పిక్చర్స్ తలపెట్టిన "బంగారక్క" చిత్రం హైదరాబాద్ సారథిలో పూర్తయింది. దాసరి దర్శకత్వంలో కొత్త తరహా చిత్రంగా "బంగారక్క" సింగారించుకుంది. మురళీమోహన్, శ్రీదేవి, సత్యనారాయణ, నిర్మల, అల్లు రామలింగయ్య, రమాప్రభ ప్రధాన పాత్రలను పోషించారు. "మామ" సంగీత సారథి. నిర్మాత వై. సునీల్ చవుదరి.

"బంగారక్క" తర్వాతేమిటి అని సునీల్‌గారిని అడిగాను. దేవర్ నిర్మించిన "తాయిల్లాదకులందై" కొన్నాను. దానిని తెలుగులో నిర్మిస్తాను. జయచిత్ర, మురళీమోహన్, సత్యనారాయణ ముఖ్య పాత్రలను పోషించగలరు", అన్నారు చవుదరి.

సెప్టెంబర్ నుంచి "అక్కినేని...దాసరి" గార్ల చిత్రం ప్రారంభమవుతుంది అన్నారు రవి శంకర్ అధినేత.

'బంగారక్క'లో మురళీమోహన్, రమాప్రభ







'ఈతరం మనిషి'లో జయప్రద

### పల్లెసీమ ఎలా నచ్చింది?

శ్రీ దేవి ఆర్ట్ పిక్చర్స్ నెల్లూరు మండలంలో నిర్మించిన "పల్లెసీమ" చిత్రం ప్రతి వ్యక్తిని ఆకర్షించగలదన్న సదభిప్రాయాన్ని, సద్విమర్శకులు యీ విలేఖరికి చెప్పారు.

చిత్రంలో ప్రశంసకు పాత్రమైన అంశాలేమిటి అని యీ విలేఖరి ప్రశ్నించాడు.

"విలేజ్ బ్యాక్ డ్రాప్ ట్రీట్‌మెంట్. పాత్రలు మనకు నిజజీవితంలో ఎదురయ్యేవిగా వుండడం. ప్రతి పాటకు అర్థం... ఔచిత్యం వుండడం. సంభాషణలు" అన్నారు విమర్శకులు.

ఒక మంచి దర్శకుడు చిన్న చిన్న విషయాల్లో కూడా ఎంత జాగ్రత్తగా తన ప్రతిభను చూపెట్టగలడో "పల్లెసీమ" ఋజువు చేసింది అన్నారా వ్యక్తులు.

"పల్లెసీమ" చిత్రం దర్శకునికి (పి. చంద్రశేఖరరెడ్డికి) ఎంత మంచి పేరు నివ్వగలదో, నటీనటులకు కూడా అంత మంచి పేరు నార్జించిపెడుతుంది అని ఆ సద్విమర్శకులు చెప్పారు.

"పల్లెసీమ" చిత్రంలో జయసుధ... సత్యప్రియ, గిరిజారాణి, రంగనాథ్... శ్రీధర్, చంద్రమోహన్, పద్మనాభం, అల్లు రామలింగయ్య గార్లతోబాటు గుమ్మడి, ప్రభాకరరెడ్డి, మిక్కిలినేని ముఖ్య పాత్రలను పోషించారు.

ఈ విలేజ్ చిత్రాన్ని బలరామరెడ్డి, పరంధామ రెడ్డిగార్లు నిర్మించారు.

### అందరికీ నచ్చింది

ప్రత్యేక ఆత్మ (చిత్రాలలో) గల ప్రత్యగాత్మ దర్శకత్వం నిర్వహించిన "అత్తవారిల్లు" చిత్రం మద్రాసు మహిళలు కొందరు చూశారు.

అందరిదీ ఒకటే అభిప్రాయం గావడం గమనించదగ్గ విషయం. చిత్రాన్ని లేడీస్ మెచ్చారు అంటే, దానికి జయం తథ్యము అన్న మాట.



'సంసారంలో సరిగమలు'లో ప్రభ, ప్రభాకరరెడ్డి

## సినిమా

"అత్తవారిల్లు" చిత్రంలో మహిళలకు నచ్చిన అంశాలు కొన్ని వున్నాయి. ముఖ్యంగా కథ నచ్చింది. కథలోని పాత్రలను, దర్శకుడు నడిపించిన విధానం నచ్చింది. అసహజత్వం ఎక్కడా, ఏ పాత్రలోనూ లేకపోవడం నచ్చింది. చిత్రం ఆద్యంతం "టెంపో" సడలకుండా, ఏం జరుగుతుందా అని ఫీలయ్యేట్టు చేసిన ప్రత్యగాత్మగారి "బ్రెయిన్" నచ్చింది.

"అత్తవారిల్లు" చిత్రంలో మొదటి మార్కులు దర్శకుడికి యిచ్చారు. తరువాతి స్థానం నాయిక ప్రభకు యిచ్చారు. ఆమెతోపాటు ఎక్కువగా ఆకర్షించినవారు యిద్దరున్నారు. జి. వరలక్ష్మి, మమత.

టెక్నికల్ సైడ్‌లో ఫస్టు మార్కులు, అన్ని మార్కులు చలపతిరావుగారికి యిచ్చారు. పాత్రోగారి మాటలను మెచ్చారు.

"అత్తవారిల్లు" వంటి మంచి చిత్రాన్ని నిర్మించిన అనుమోలు వెంకట సుబ్బారావుగారిని, ఒక విలువయిన కథను వ్రాసిన సత్యవతీదేవిగారిని అందరూ అభినందించారు. "అత్తవారిల్లు" చిత్రం ఎప్పుడు విడుదలయినా, ఎంత పెద్ద చిత్రం మీద పడినా, నిర్భయంగా ప్రదర్శింపబడగల శక్తి నిం బడసియుంది అన్నది మహిళల ప్రగాఢ నమ్మకం.

### ప్రత్యగాత్మకు కొత్త చిత్రం

ప్రతిభావంతుడు అని ఎప్పుడో భారత చలన చిత్ర రంగం ప్రత్యగాత్మను పిలిచింది. ఆ "పిలుపు"లో నూరు శాతం నిజం వుందని, ఆయన చిత్రాలు విశదం చేస్తాయి.

తెలుగు చలనచిత్ర సంస్థలలో అంజలీ పిక్చర్స్‌కు ప్రముఖ స్థానం వుంది. ఆ సంస్థ నిర్మించినవన్నీ మంచి చిత్రాలే.

అంజలీ పిక్చర్స్ జనవరి ఒకట్నుంచి ప్రారంభించే కొత్తతరహా సాంఘిక చిత్రానికి, ప్రత్యగాత్మను దర్శకుడుగా ఎంపిక చేసినట్టు, నిర్మాత ఆదినారాయణరావు చెప్పారు.

"అమ్మకోసం" దగ్గర్నుంచి, ప్రత్యగాత్మ గారిని అనుకుంటున్నాం అంది అంజలీదేవి.

అంజలీ పిక్చర్స్ తలపెట్టిన కొత్త చిత్రంలో "నటశేఖర" కృష్ణ గెస్టుగా నటించడానికి, "రెబల్‌స్టార్" అతిథిగా అగుపించడానికి అంగీకరించారు.

ఫక్తు ఫామిలీ చిత్రంగా వుండే యీ చిత్రంలో అంజలీదేవి, సత్యనారాయణ ప్రధాన జంటగా నటిస్తున్నారు. సహాయ పాత్రలను గిరిబాబు, మోహన్‌బాబు, రోజారమణి, శ్రీదేవి, వెన్నిరాడై నిర్మల, దీప పోషించగలరని తెలిసింది.

ఈ చిత్రానికి బాలమురుగన్ కథను, సత్యానంద్ సంభాషణలను వ్రాశారు. సంగీతానికి ఆదినారాయణరావు, ఛాయకు కృష్ణారావు అధిపతులు.

ఈ చిత్రంలో అయిదు పాటలుండగలవని, సంగీత దర్శకుడు ఆదినారాయణరావు ఈ విలేఖరితో అన్నారు.





o-o-o-o-o-o-o-o 'అత్తవారిల్లు'లో జి. వరలక్ష్మి, కె. విజయ o-o-o-o-o-o-o-o-o-o సురేష్ మూవీస్‌వారి హిందీ చిత్రంలో రేఖా o-o-o-o

**ప్రపూర్ణ మూవీస్ !**

నవంబర్ యిరవై రెండున ఎ. వి. ఎమ్. లో ప్రారంభమైన ప్రపూర్ణ మూవీస్‌వారి వర్ణ చిత్రం షూటింగు పది రోజులు కొనసాగింది.

మూడు పాటల్లో ఏది మొదటిది, ఏది రెండవది అని చెప్పనలవికాని విధంగా మంచి బాణీలను సమకూర్చారు.

ఈ చిత్రాన్ని కె. వెంకటేశ్వరరావు, కె.ఎస్.ఆర్.

ప్రకాశరావుగారి అబ్బాయి, చిరంజీవి టి. ఎల్. వి. బాబుగారిని జయసుధ యింట కలిసినప్పుడు, పై సమాచారాన్ని ఆయన వెల్లడించారు.

"వాయ్యువన్ పక్కమ్" చిత్రాన్ని యీ విలేఖరి కూడా చూశాడు. లక్ష్మి సుపర్బ్‌గా నటించింది.

తెలుగులో జయసుధ ఆ పాత్రకు యెంతేని న్యాయం చేస్తుంది. ఆమె డేట్స్ కూడా మేనేజ్ చేస్తానని, దర్శకుడు బాబుతో చెప్పింది.

— శ్రీనివాస్ ●



'ఒకే రక్తం'లో కృష్ణంరాజా, జయప్రద

'సావాసగాళ్ళు'లో రమాప్రభ, నాగేష్



ప్రముఖ దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో సింగారించుకునే యీ రంగుల చిత్రానికి గొల్లపూడి కథ, మాటలను సమకూర్చారు.

ఈ చిత్రంలో కృష్ణంరాజా, శారద, రావు గోపాలరావు, చంద్రమోహన్, పద్మప్రియ, జయలక్ష్మి, మోహన్‌బాబు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

సంగీత దర్శకుడు జె. వి. రాఘవులు ఆచార్య ఆత్రేయ వ్రాసిన మూడు పాటలను రికార్డ్ చేశారు.

చౌదరి నిర్మిస్తున్నారు. ఎగ్జిక్యూటివ్ నిర్మాతలు : ఎమ్. వి. ఎమ్. ఎస్. ప్రసాద్, ఎమ్. డి. ఆర్. ప్రసాద్.

**అనిల్ ప్రొడక్షన్స్**

ప్రముఖ దర్శకుడు తాతినేని ప్రకాశరావుగారి మనవడి పేరుతో వెలసిన యీ సంస్థ తమిళంలో "హిట్" అయిన "వాయ్యువ ఎన్‌పక్కమ్" చిత్రాన్ని తెలుగుకోసం కొన్నది.

# బంధం-సంబంధం



వేదగిరి రాంబాబు

"అబ్బ ! ఏమిటిది మరీ చిన్నపిల్లలై పోతున్నారు !"

"ఊహూఁ ! ఇవాళాఫీసుకెళ్ళను నీదగ్గరే వుండిపోతాను"

ఇద్దరివీ నవ్వులు —

"బావుంది ! ఆఫీసు కెళ్ళకుండా ఎవరైనా పెళ్ళాం కొంగు పట్టుకు తిరుగుతారేమిటి ?"

"అందరి సంగతి వేరు – నా బంగారు బొమ్మ సంగతి వేరు. నీ కున్నంత అందం ఎంతమంది కుంటుంది ?"

"మీరు మాత్రం? – హిందీ సినిమా హీరోలా లేరేమిటి ?"

కొద్ది క్షణాలు నిశ్శబ్దం –

మళ్ళీ నవ్వులు –.

పిచ్చెక్కినట్లుంది నాకు. నేనా రూమ్‌లోకి వచ్చి ఇంకా ఇరవైనాల్గుగంటలు కూడా కాలేదు. వాళ్ళ ఆప్యాయత, అనురాగం నాలో ఓ విధమైన సంచలనాన్ని కల్గించడం ప్రారంభించింది.

రూమ్‌కి తాళం వేసి రోడ్డుమీదకొచ్చాను.

సరిగ్గా అదే సమయంలో పక్క వాటాలోంచి అతనూ బయటికొచ్చాడు. అతని వెనకే ఆమె గుమ్మంలోకి వచ్చింది

రెండడుగులు వేసి అతను వెనక్కి తిరిగాడు.

ఆమె నవ్వుతూ అతనివంక చూసింది.

అతను చెయ్యూపాడు.

ఆమె చెయ్యూపింది.

"సాయంత్రం ఆఫీస్సైపోగానే వచ్చేస్తారు కదూ ?"

"అయిదున్నరకల్లా ఇంట్లో వాల్తాను."

అతను బయల్దేరాడు.

ఆమె అలాగే గుమ్మంలో నిలబడి చూస్తోంది.

అతను వుండుండి వెనక్కి తిరిగి చూస్తున్నాడు.

నాకు నవ్వొచ్చింది !

ఆశ్చర్యం కూడా కల్గింది !

ఎంతటి అన్యోన్య దాంపత్యం వాళ్ళది ! పద్దనుకున్నా పక్కవాటానే కావడంచేత వాళ్ళ కబుర్లు, సరసాలు వినబడుతూనే వుంటాయ్!

బస్ స్టాప్‌కి చేరుకున్నాను.

అతనూ వచ్చి నా పక్కనే నిలబడ్డాడు.

ఓ క్షణం అతనివంకే చూశాను.

నిజమే ! అతని భార్య అన్నట్లే హిందీ సినిమా హీరోలాగానే వున్నాడు.

ఇంతలో బస్సొచ్చింది.

గుంపులోకి జొరబడ్డాను నేనెక్కే తొందరలో అతనా బస్సు ఎక్కాడో లేదో గమనించలేదు.

* * *

సాయంత్రం అయిదున్నరకల్లా రూమ్‌కి చేరుకున్నాను. అప్పటికే అతనొచ్చేసినట్లున్నాడు. పక్క వాటాలోంచి నవ్వులు వినబడుతున్నాయ్.

"ఏమండీ! ఇవాళైనా సిన్మాకెళ్దామా ?" అడిగిందామె.

"సినిమాకా ? వద్దు. మూడు గంటలసేపు నువ్వు ప్రక్కనున్నా ఎంటరితనం అనుభవించాలి. సినిమాహాల్లో మీద చెయ్యేసినా 'డిగ్నిటీ' మీద ఓ చిన్నసైజు వుపన్యాసాన్నిస్తావ్."

"లేకపోతే! అంతమంది మధ్యలో అలాంటి పన్లు చెయ్యడానికి మీకు సిగ్గన్నా వెయ్యదూ !"

"అందుకే మేడమ్ ! ఆ సినిమా పేరున నువ్వు నా ప్రక్కనున్నా దూరంగా వుండటం నావల్ల కాదు, హాయిగా ఇంట్లోనే వుండిపోదాం."

"అంటే – ఇంట్లో వుంటే మాత్రం మీ కెదురుగా కూర్చుంటానా? చాలా పన్లున్నాయ్."

"ఇద్దరం కలిసి – ఆడుతు పాడుతు పని చేస్తుంటే అలుపు సొలుపేమున్నది ..." అతను పాటందుకున్నాడు.

"స్వామీ! కాస్త మీ పాటాపండి. ఆడుతూ పాడుతూ ఇప్పుడేమీ పని చెయ్యక్కర్లేదు. మీరాఫీసు నించి వచ్చేసరికే పనంతా పూర్తి చేసుకున్నాను. మీరు కాస్త మొహం కడుక్కొస్తే కాఫీ తాగుదాం. ఆ తర్వాత అలా పార్క్‌కేసి వెడదాం."

"అలాగే ! దేవీగారి ఆజ్ఞ !"

ఒక్క నిముషం నిశ్శబ్దం.

బహుశా అతను మొహం కడుక్కోటానికి బాత్‌రూమ్‌లోకి వెళ్ళుంటాడు.

కప్పుల శబ్దం –

అంటే ఆమె కాఫీ కప్పుల్లో పోస్తుండాలి.

"ముందు నువ్వు తాగు, తర్వాత నేను తాగుతాను."

"కాదు! ముందు మీరే తాగండి."

"మవ్వు తాగుతేనే నేను తాగుతాను."

"ఎన్నిసార్లు చెప్పానండి. నాకు మీ ఎంగిలి తాగడం ఇష్టం — కానీ, మీరు నా ఎంగిలి తాగడం ఇష్టంలేదు."

"సరేలేకాని, ఓసారిలా దగ్గరకి రా."

"ఎందుకు?"

"మాట"

"ఇక్కడ చెప్పకూడదా?"

"కూడదు. చెవిలోనే చెప్పాలి."

ఓ క్షణం నిశ్శబ్దం.

"ఛీ...పొండి. తలుపులు తీసేవున్నాయ్ అవతల" నవ్వులు.

నాకు మతి పోతోంది. వాళ్ళ మాటల్నుంచీ తప్పించుకోడానికి ట్రాన్సిస్టర్ ఆన్ చేశాను.

మరికొద్ది సేపట్లో షికారు కెళ్తూ కన్పించారు వాళ్ళిద్దరూ! నిజమే అతనన్నట్లు ఆమె బంగారు బొమ్మలాగానే వుంది! వాళ్ళిద్దర్నీ చూస్తుంటే ఎంతో చూడముచ్చటగా వుంది.

వాళ్ళ అన్యోన్యతని చూస్తుంటే ముచ్చటతో పాటు ఈర్ష్యకూడా కల్గింది నాలో.

వాళ్ళిద్దరూ ఒకళ్ళకోసం మరొకళ్ళు సృష్టింపబడ్డారు. అన్నివిధాల అంతగా కల్సిపోయే భార్య దొరకడం ఎంత అదృష్టం! అటువంటి అదృష్టం నన్నూ వరిస్తే ఎంత బావుండు. సరదాగా నవ్వుతూ, తుళ్ళుతూ; చీకూ, చింతా లేకుండా జీవితాన్ని గడిపేయవచ్చు. తీయటి అనుభూతుల్ని వూహించుకుంటూ అలా ఎంతసేపు గడిపానో నాకు తెలీదు. గదంతా చీకటి క్రమ్మేసరికి, లేచి లైటేసి వాచీ చూసుకున్నాను.

ఏడుంబావు!

మొహం కాళ్ళూ, చేతులు కడుక్కుని భోజనానికి హోటల్‌కి బయల్దేరాను.

సందు మొదట్లో ఇంటికి తిరిగొస్తూ వాళ్ళిద్దరూ ఎదురొచ్చారు.

*　　*　　*

మర్నాడు సాయంత్రం కూడా నేనొచ్చేసరికి ప్రక్క వాటాలోంచి మాటలు వినబడుతున్నాయ్.

"డియర్! రేపు సాయంత్రం కాంప్ కెళ్ళాలి."

"ఎన్నాళ్ళు?"

"నాల్గు రోజులు."

"అమ్మో! నాల్గు రోజులే! నేను వంటరిగా వుండలేను మీతో వచ్చేస్తాను."

"నేనూ అదే అనుకుంటున్నాను. నిన్నొదిలి నేను మాత్రం వుండగలనా ఏమిటి? అందుకనే ఇద్దరం కల్సివెళ్దాం. ఏదైనా ఓ హోటల్లో వుందాం. పగలల్లా ఆఫీసు సేవ, సాయంత్రం నించి దేవిగారి సేవ."

"అలా చేస్తే మీ కాఫీసు పనిమీద వెళ్ళినట్లే వుండదు. ఇంచక్కా హనీమూన్ వెళ్ళినట్లు వుంటుంది. అవునా?"

ఇద్దరి నవ్వులు —

ఉద్యోగరీత్యా ఇంతవరకూ ఎన్నో వూళ్ళు తిరిగాను, ఎంతోమందిని చూశాను కానీ, ఇంత అన్యోన్యత, అనురాగం వున్న జంటని మాత్రం ఎక్కడా చూళ్ళేదు. కనీసం కాంప్‌లో వున్న నాల్గు రోజుల ఎడబాటుని కూడా భరించలేని వాళ్ళ బంధం ఎంత గొప్పది!

రేపు వివాహమైతే మేంకూడా ఇలాగే వుండాలి — ఒకళ్ళ కోసం మరొకళ్ళు. అప్పుడే వుంటుంది తృప్తి.

ఆ రాత్రంతా నా మెదడులో ఆ ఆలోచనే!

*　　*　　*

మర్నాడు నిద్ర లేచేసరికి వంట్లో నలతగా వున్నట్లనిపించింది. దానికి బద్ధకంకూడా తోడైంది.

బస్‌స్టాప్ దగ్గర్లోనే వుంటున్న లక్ష్మీపతి ఇంటికెళ్ళి లీవ్‌లెటర్ ఇచ్చి వద్దామని బయల్దేరాను.

అప్పుడే అతనూ ఇంట్లోంచి బయటికొచ్చాడు. ఆమె మామూలుగా చెయ్యూపింది. అతనూ చెయ్యూపుతూ బయల్దేరలేక బయల్దేరినట్లుగా బయల్దేరాడు.

పది గజాలు నడిచానో లేదో 'హల్లో!' అంటూ విన్పించింది. తలెత్తి చూశాను.

అతను ఫ్రెండ్ కాబోలు! ఇద్దరూ కల్సి మాట్లాడుకుంటూ నడవసాగారు. వాళ్ళకి కొద్ది వెనక్గా నేను నడుస్తున్నాను. చాలాకాలం తర్వాత కల్సినట్లు తెలుస్తోంది వాళ్ళ మాటల్నిబట్టి!

"ఇప్పుడు నువ్వు విజయవాడలోనే వుంటున్నావా?" అడిగాడతను.

"సంవత్సరమైంది బందరు బదిలీ అయి. ఈ వీధి చివరే మా పిన్నత్తగారిల్లు. వాళ్ళమ్మాయి పెళ్ళికి నిన్ననే మా ఆవిడొస్తే వచ్చాను." జవాబిచ్చాడు అతని స్నేహితుడు.

"ఇంకెన్ని రోజులుంటా విక్కడ?"

"రేపుదయం వెళ్ళిపోదాం అనుకుంటున్నాం."

"మా ఇంటికి రాకుండానే వెళ్తారా?"

"మీ ఇల్లెక్కడ?"

"అదిగో! ఆ గోపీ రంగు మేడలో గేటు కెదురుగా వున్న వాటా!" వెనక్కి తిరిగి ఇంటికేసి చూపిస్తూ అన్నాడు.

"అయితే రేపుదయం వెళ్ళబోయేముందు మీ ఇంటికొస్తాం."

"సారీ బ్రదర్! ఇవాళ సాయంత్రం కాంప్‌కి వెళ్తున్నాను. వీలైతే ఇవాళ సాయంత్రం ఆరు గంటల్లోపే రండి."

"ఇవాళ మధ్యాహ్నం మా బావమర్ది ఇంటి కెళ్తున్నాం. అతను మరీ మరీ చెప్పాడు. వెళ్ళకపోతే బావుండదు. పోనీ, రేపుదయం వస్తే మీ ఆవిడుంటుంది కదా! ఆవిడకి మా ఆవిడ్ని పరిచయం చేస్తాను."

"రేపిక్కడ ఆవిడ కూడా వుండటల్లేదు నాతోపాటే తీసుకెళ్తున్నాను."

ఆ మాట వినగానే స్నేహితుడు భళ్ళున నవ్వేడు.

"అంటే! నువ్వు కాలేజీలో చదివే రోజుల్లో మాట్లాడిన మాటల్ని 'తు. చ.' తప్పకుండా పాటిస్తున్నావన్నమాట!" బలవంతాన నవ్వు నావుకుంటూ అన్నాడు స్నేహితుడు.

కొన్ని క్షణాలు అతను మవునంగా వూరుకుని నెమ్మదిగా అన్నాడు.

"ఎప్పటికైనా నా అభిప్రాయం మారదురా బాబు! 'స్త్రీ' అంటే చపలచిత్తురాలు! ముమ్మాటికీ అంతే! పాత్ర స్వరూపాన్నిబట్టి ద్రవం ఆకారం మారినట్టే, పరిసరాల్నిబట్టి స్త్రీ స్వభావం కూడా మారుతూంటుంది. కాబట్టే మగాడెప్పుడూ వీలైనంత వరకూ వాళ్ళని కనిబెట్టుకుని తమ పరిధిలోనే వుండేలా చూసుకోవాలి. అందుకే మా ఆవిడ్నికూడా కాంప్‌కి తీసుకెళ్తున్నాను. కాంప్‌కే కాదు! నే నెక్కడికి వెళ్ళినా తనుండాల్సిందే! తనెక్కడికి వెళ్ళినా నేనుండాల్సిందే!"

అతని స్నేహితుడేమీ మాట్లాడలేదు. అదోలా నవ్వి వూరుకున్నాడు.

నేను వుక్కిరిబిక్కిరయ్యాను.

'ఏమిటి తను మాట్లాడేది! భార్యతో అంత అన్యోన్యంగా వున్నా అతని మనసులో ఇలాంటి సంకుచిత భావాలున్నాయా? పైకి ఆమె విషయంలో చూపేదంతా నటనేనా?'





## * మీకు తెలుసా? *

### సర్వరోగనివారిణి

# "జిన్‌సెంగ్"

పై బొమ్మలో మానవాకారంలో వున్నట్లున్న "దుంప" కొరియాలో మాత్రం పండుతుంది! దీన్ని మనవాళ్ళు సంజీవిని, సర్వరోగ నివారిణి, "త్రైలోక్య చింతామణి" అని పిలిచే అపురూపమైన "ఓషధి మొక్క"లతో పోల్చవచ్చును...అసలీ దుంప పేరే "మానవాకారంలో వుండే దుంప" — "జిన్ సెంగ్" అన్న చైనా మాటలకి అర్థం అదిట! వనస్పతి విజ్ఞాతలు దీన్ని "క్యూర్ ఆల్" గానే నమ్ముతున్నారు.

ఈ జిన్‌సెంగ్ ఓషధి కందమూలాలు "పొడి", "మాత్రలు", "గొట్టాలు"గా కొరియా జపాన్, చైనా దేశాలలో దొరుకుతుంది.

దీంతో "తేనీటి పొడి" శీతల పానీయం పొడి (మనం ధనియాల టీ, సుగంధపాలు తాగినట్లు) చేసుకుని సేవిస్తారు కూడా. ఇది సర్వరోగ నివారిణి. దీన్ని తైలంలో కలిపి రాసుకుంటే జుత్తు వొత్తుగా పెరుగుతుంది. వంటికి మర్దన చేసుకునే లేహ్యంగా, తలంటుకునే షాంపూగా చివరికి టూత్ పేస్టులో కూడా కలిపి వాడుతూంటారు. ఆరోగ్యపుష్టికి అందాన్ని యినుమడించటానికి, వీర్య పుష్టికికూడా యీ "జిన్‌సెంగ్" దుంపను రకరకాలుగా వాడుతారు. కాని యిది చాలా సున్నితమైన "ట్యాప్ రూట్" కొరియాలోనే తప్ప యితరచోట్ల ఎదగదు. ఈ దుంప "పెరుగుతున్నప్పుడు" వర్షం — మంచు చివరికి వెల్తురూ గాలీ అన్నీ తగు మోతాదులోనే వుండాలి తప్ప మోతాదు మించితే రోగా లన్నింటికి మందైన యీ "మందు మూలం" మందు అడగకుండా చస్తుంది! అయితే బాగా ఆరోగ్యవంతులైనవారు దీన్ని టానిక్‌లాగా తెగ తినేస్తే ప్రమాదమా? అన్న విషయం ప్రస్తుతం పరిశోధనలో వున్నది. దీన్ని హోమియోపతి మందులలో కూడా వాడుతున్నారు.

జపాన్, చైనా, తైవాన్, హాంగ్‌కాంగ్, అమెరికా పశ్చిమ జర్మనీలు దీన్ని కొరియా నుంచి కొనుక్కుంటున్నాయి. మొత్తం 57 లక్షల కిలోల జిన్‌సెంగ్ పొడిని కొరియా ఎగుమతి చేస్తుంది. మరో నాలుగేళ్ళకి దీనిమీద కొరియాకి వచ్చే విదేశ మారకద్రవ్య ఆదాయం పది కోట్ల డాలర్ల దాకా వుంటుందట! కొరియా వెళ్ళే విలాస యాత్రికులు దీన్ని మార్కెట్‌లో "వేటాడి" పట్టుకుని కొనుక్కుంటారుట! దీని సంగతి బాగా తెల్సిన హోమియోపతి లేడీ డాక్టర్ మన దేశంలో నాగపూర్‌లో వున్న డా. రెమా కోచార్ గారే నంటారు. [పీరాజీ]

## బంధం — సంబంధం

వళ్ళు జలదరించినట్లైంది నాకు. మరొక్క మాట కూడా వాళ్ళ సంభాషణ వినాలనిపించలేదు. త్వరత్వరగా అడుగులేసుకుంటూ వాళ్ళని దాటి ముందుకి నడిచాను.

లక్ష్మీపతికి లీవ్ లెటరిచ్చి గదికి చేరి పడుకున్నాను. ఏదో నవల చదవాలని ప్రయత్నించాను కాని మనసు కేంద్రీకృతం కావడంలేదు. ఉండుండి అతని మాటలే గుర్తుకొచ్చి అతనిమీద ఓ విధమైన అసహ్యభావం — ఆమెమీద సానుభూతి చోటు చేసుకోసాగాయ్.

ఈ ఆలోచనలో —

ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. మెలకువ వచ్చేసరికి మధ్యాహ్నం రెండు దాటింది. ప్రక్క వాటాలోంచి ఆమె గొంతు మరో స్త్రీ గొంతు కలగా పులగంగా వినబడుతున్నాయ్.

"అబ్బాయితోపాటు నువ్వెందుకమ్మా కాంప్ కెళ్ళడం?" ఆ గొంతుకడుగుతోంది.

"మీకు తెలీదు పిన్నిగారూ! ఈ మగాళ్ళని నమ్మటానికి వీల్లేదు. పెళ్ళాం పక్కన లేకపోతే ఎన్ని వేత్రి వేషాలైనా మొలకెత్తుతాయి వాళ్ళ మనసుల్లో. పైగా ఈ మనిషి కొంచెం అందంగా కూడ వున్నారేమో, కనిపెట్టి వుండకపోతే నాకు దక్కరు! మరెవ్వరో దక్కించుకుపోతుంది! అద్సరేగాని పిన్నిగారూ! కాస్త ఈ నాల్గు రోజులు మా మొక్కల నీళ్ళ విషయం చూద్దురూ మీకు పుణ్యముంటుంది."

నాకు పెద్ద 'షాక్' తగిలినట్లైంది.

అంటే... అంటే... అతని విషయంలో ఆమెది నిజమైన ప్రేమ కాదన్నమాట!

వాళ్ళ అన్యోన్యతంతా నటనతో నిండివున్న నాటకమన్నమాట!

భగవాన్!—

లేచి త్వరగా మొహం కడుక్కుని గదిలోంచి బయటపడ్డాను.

వేరే గది వెదుక్కోవాలి!

ఇలాంటి నటుల పక్కనే వుండి వాళ్ళ డ్రామా డైలాగులూ, నటనా—వింటూ, చూస్తూ గడపడం నావల్లకాదు.

# ప్రశ్నావళి * — కె. రామలక్ష్మి

**ఎ. ఎస్. ఆర్. బ్రాహ్మణగూడెం**

స్త్రీ సమానత్వం నెరవేరేది అసలు జరిగేది మన సమాజంలోనే కదా. అటువంటప్పుడు స్త్రీలు ముందు మన సమాజం కోసం పాటు పడితే— సమస్య తీరి పోతుంది.

బాగుంది వరస! వెర్రి తీరింది రోకలి తలకి చుట్టు— అన్నట్టుంది. అసలు ఆడది సాటి మని షిగ గుర్తించని చోట — మన సమాజం, సమా జం అన్న మాటలకి — అర్థం లేదు.

**యు. పి. ఆర్ గుడివాడ.**

రామలక్ష్మి గారికి తలపొగరు ఎక్కువ. మగాడితో సమానాస్థాన ఇవ్వవచ్చు. అంత మాత్రంచేత మగరాయుడి లా డ్రెస్ చేసుకుని బజార్లవెంట తిరగమనా ?

రావుగారూ, మీరు బజార్లవెంటే వుంటారా? ఫాషన్లు చూసి దడుసుకునేటంత పిరికితనమా ?

**వి. వై. కె. ఆర్. హైదరాబాదు.**

ఇప్పటి దాకా ధైర్యం చిక్క బట్టాను కాని..

ధైర్యం కోల్పోకండి ధైర్యమే సర్వస్వం ధైర్యంపోతే సర్వస్వం పోయినట్టే కద.

**ఎస్. వి. సంగారెడ్డి**

స్త్రీ చిత్తం క్షణానికొక తీరున వుంటుం దంటారు. మరి....

పురుష చిత్తం అరక్షణం కూడా నిలకడగా వుండదు. కనుక ఆడవారినలా అంటారు. అంతే.

**కె.డి.పి. వీరఘటం.**

భర్తను వదిలిన స్త్రీని, భార్యను వదలిన పురుషుణ్ని ఎలా దండించాలి ? ఎలా పోదార్చాలి?

మీరు అనవసరంగా కలగచేసుకోకుండావుంటే వోదార్చినంత ఫలం ! అయినా తొడుక్కున్న జోడు ఎక్కడ కరుస్తోందో తొడుక్కున్న వారికే తెలు స్తుంది. కాని మీ కెలా తెలుస్తుంది. భార్యా భర్తలు విడిపోడాలూ—కలుసుకోడాలు వాళ్ల వ్యక్తిగత సమస్య. వాళ్ల సమస్యను వాళ్లే పరి ష్కారం చేసుకుంటారు... వోదార్పు, సహాయం, శిక్ష కక్ష అంటూ అనవసరంగా వారి వ్యక్తి గత సమస్యని సాంఘిక సమస్యగా వహార్చేయడం చేయకూడని పని.

**ఎస్. ఎన్. అంకంపల్లి**

స్త్రీ స్వాతంత్రము అంటే ?

ద్వితీయవ్యక్తిలా బ్రతకవలసి రాకుండా వుండడం. అనుకున్నదీ అన్నదీ అన్నట్టు, బతుకే ఓ కత్తిమీద సాముగా బ్రతకవలసి రాకుండా వుండడం. తను కోరుకునే పనిచేసే హక్కు కల్గివుండి, తన బాధ్యతలను నిర్లక్ష్యం చేయ కుండా వుండడం—స్త్రీ కోరుకునే స్వాతంత్రా నికి కూడా పరిధులు ఏర్పరుచుకునే వుంటుంది. అది కూడా గుర్తించడానికి ఇబ్బంది పడు తోంది సంఘం.

**ఎన్. జె. ఎస్. ఆర్. జగిత్యాల**

కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకుంటే అతనికి ఎలా అత్యవసర పరి స్థితుల్లో ఆర్థిక సహాయం 500.00 దాకా చేయగలదా ? అలా చేయ గల్గితే అవసరమైన వివరాలు ఇవ్వగలరు.

చూడండి పెళ్లి, కుటుంబ నియంత్రణ, దానం ధర్మం, మంచిపనులు, ఇతరులకు సహాయం ఇలాంటివి డబ్బుకోసం ఎవరూ చెయ్యరు మీ కుటుంబభారం అయితే మీకే కష్టం. అది గ్రహించకుండా ప్రభుత్వం ప్రోత్సహిస్తున్న పని కీ ఇలాంటి షరతులు ? అత్యవసర పరిస్థితి మీలాంటి స్వలాభ పేక్షకులకి ఆర్థిక సహాయం చేయడంకోసం కాదు డబ్బుకోసం కాకుండా మీ కోసం, దేశంకోసం అనుకుని ఓ క్షణం ఆలో చించి చూడండి

**టి. ఎస్. అన్నంగి**

కె. రా. గారూ మీరు ధలేవారు ఆడవాళ్లు చెప్పడానికి కూడా జంకే విషయాలు కుండ బద్దలు కొట్టినట్టు చెప్పేస్తారే మీకు ఎవరేమ ఏమేనా అనుకుంటారేమో అని భయంగా వుండదా ?

భయం ఎప్పుడు వస్తుందో తెలుసా? (1) చెప్పేది అబద్ధం అయినప్పుడు (2) స్వార్థంతో కూడున్నప్పుడు నిజంగా నలుగురి పట్ల నిజ మైన విషయాన్ని 'ఆడదాన్ని' అయినంత మాత్రాన చెప్పడానికి జంకడం ఎందుకు ? ఎవరో ఏదో అనుకుంటారని భయం ఎందుకు.. ధైర్యం వున్నవాళ్లు ముఖంమీద అంటారు. ధైర్యంలేనివాళ్లు వెనకాల అనుకుంటారు. ముంద రన్న వాళ్లతో బాధలేదు. వెనక అన్నవాళ్లని లెక్క చెయ్యక్కరలేదు !

**శ్రీనాథ్. గుంటూరు**

స్త్రీలు నేరాలు చేయడానికి కారణం బల హీనతా ?

పురుషులు నేరాలు చేయడానికి కారణం బలమూ ధీరుత్వమూ అనుకుంటున్నారా ? !

**ఆర్. ఎస్. వి. కోస్గి**

స్త్రీకి మాంగల్యం ముఖ్యం అయితే పురు షునికి ?

స్త్రీ ముఖ్యం అనేకదా అర్థం !

**వి. పి. ఎస్. కాకినాడ**

మీకు తెలివి ఎక్కువనేగా గర్వం ?

కాదు. అసలు తెలివైన వాళ్ల లక్షణం ఏమిటో తెలుసా, తాము తెలివైన వాళ్లమని అనుకోక పోవడమే !

**డి. కె. కె. గుంటూరు**

ఆడది అంటే మగవాడితో సమానంగా వుంటూ తన బాధ్యతలను నెరవేర్చుకుంటూ వుండాలనే మీ తత్వం అర్థం అయింది. కాని దాన్ని అర్థం చేసుకోకుండా తమ సంకుచిత మనస్తత్వాన్ని ఎలా బయటపెట్టుకుంటారో వీళ్లు ?

అర్థం చేసుకోకపోయినా వారి తత్వం వహాల్పు కోవడం చిన్నతనంగా తోచి ఇలాపైకి అంటూ వుంటారు.

(★) (★) (★) 'పల్లెసీమ'లో సత్యప్రియ, కె. విజయ (★) (★) (★)



# యువ సాహితీ సంస్థలు

## చిట్కాలు

హైదరాబాద్ సంగతి సరేసరి – బెజవాడ, గుంటూరు, విశాపట్నం, విజేనగరం, కాకినాడ లాంటి పట్నాలలో వున్న యువ రచయితలకి సాహిత్యసేవా పిపాస చాలా యెక్కువగా వుంటూ వుంటుంది. సాధార్ణంగా యింటర్‌మీడియేట్‌కి డిగ్రీకి మధ్యా "పియ్యూసీకి," "యూ.సీ"కి మధ్యో మార్చికి, అక్టోబర్‌కీ మధ్యో కొంచెం తీరిక చిక్కుతుంది. ఈ యువజనులకి... ఆటలాడటం, నాటకాలాడటం లాంటి కార్యక్రమాలు 'కాస్ట్లీ' కనుక సాహిత్య రంగంలోకి దూకేస్తుంటారు... ఇది మంచిదే.

వెంటనే వో పదిమంది కలిసి లెటర్‌హెడ్‌లు గుద్దించేస్తారు. ఓ మంచి విశేషణం చేర్చి సాహితీ సంస్థ అని పేరు పెట్టేస్తారు... వీళ్లల్లో కొంచెం చొరవవున్న 'బిజుకప్ప'లుంటారు. వీళ్లు 'బావురు' కప్పల్లాగ అరవగలరుకూడా... ఒక కొమ్ములు తిరిగిన వాణ్నో – కొమ్ములేకపోయిన చెయ్యి తిరిగిన రచయితనో పిలుస్తారు... ప్రారంభోత్సవం గానిచ్చేస్తారు. వో కవితా సంకలనం, వో సోవనీరు వేస్తారు...

సంకలనకర్తకి సోవనీరు యెడిటర్‌కి 'చాకిరీ' తప్ప చేతి చమురు వదలకుండా చూసుకుంటారు... సభకి వచ్చిన పెద్దమనిషి "మీరింకా కుర్రాళ్లు... మీకు భాష రాదు గ్రామర్ రాదు పత్రికల పాలసీలు తెలీవు' పబ్లిషర్‌ల అవసరాలు తెలీవు లాంటివేవో చెప్పేస్తాడు... పూలదండ పట్టుకుని యీ కుర్రాళ్ళు యేర్పాటు చేసిన వాహనం మీదే యింటికి వెళ్లిపోతాడు...

ఇదంతా "గుడ్" కాని యింతకన్నా 'బెటర్' యేదైనా వుందా? గేయాలు అంటే "వచన పద్యాలు" రాయని యువ భాస్కరుడు అరుదు... వ్యాసం రాయాలంటే వివరాలు కావాలి – వోపిక వుండాలి కథ రాయాలంటే దానికి కావలసిన మెళకువలు తెలియాలి – అది వేసుకునే పత్రిక వుండాలి... లేకపోతే రాసిన శ్రమ వృథా పోతుందే అన్న విపరీతమైన మనోవ్యాధి పట్టేస్తుంది... యింతటి 'కథ' అడవిగాచిన వెన్నెల అయిపోతుందేమోనని వుత్సాహం నీళ్ళు



గారిపోతుంది ... పోనీ పత్రికలలో వేస్తే, పెద్ద బల్ల వేసుకూర్చున్నవాణ్ని 'నయాన' 'భయాన' తోమేసి వేయించుకుందామా? అన్నా కథ వ్యాసం "నైచల్యా" - అంచేత గేయం రాయాలి... ఏదో 'వార' ఓ వార పత్రికలో అది చోటు చేసుకుంటుంది — సీటులేదన్న కాలేజీలో "రిజర్వుడు సీటులోకో, డొనేషన్ సీటులోకో దూరినట్లు దూరిపోతుంది కనుక "వచన పద్యం" పత్రికల్లో పడ్డానికి తొలిమెట్టు — నిజంగా యువతీ యువకుల "భావావేశా"నికి 'ఉద్రే'కానికి ఖర్చు తక్కువ "ప్రాజెక్టు" వచన పద్యమే!

యువజనులలో గల ఈ 'కండూతి'ని సద్వినియోగం చేసుకునే సంస్థలు కొన్ని గేయాల సంకలనం వేస్తాం — కవితా సంపుటాలు వేస్తాం — కావున అభ్యుదయభావాలు గల సిల్లకాయలంతా మీ మీ గేయాలు రాసి పంపాలి — ముగింపుతేదీ ఫలానా— చిరునామా ఫలానా అంటూ పత్రికల ఉత్తరాల కాలమ్‌లో ఉచిత ప్రకటన ఒకటి కొట్టేస్తారు. దాంతో పత్రికలలో అచ్చుమొహం చూడని గేయ శర పరంపర యీ సంస్థలమీద కురుస్తుంది— ఛిన్నుంచి వాళ్లు జాగ్రత్తగా గేయాల్ని ఎంచుకుని — వాటిని వాళ్ల శక్తిసామర్థ్యాలలో మరమ్మత్తు చేసి — అనక 'అయ్యా! మీ 'కవిత'ని మేం తీర్చిదిద్దాం — యీక కవితా సంకలనం ఫలానా ప్రఖ్యాత చిత్రకారునిరచన అయిన ముఖచిత్రంతో అచ్చాఫీసుకి తోసేస్తాం కాకపోతేమీరు సభ్యత్వ రుసుము— మరియు గేయ సంకలనం వెల మీకుగానక పాతికశాతం మినహాయించుకుని ఎం. వో. పంపడం 'హో..'మని ఉత్తరాల పరంప రకురిపించేస్తారు... షరాకూడా వుంటుంది. పది సంకలనాలు మీరు మీ స్నేహితులకోసం కొంటే — మీ కాపీ వుచితం. పోస్టేజీ మా సొంతం —

"సినిమా తీస్తాం... కొత్త నటీనటులు కావలెను... ముందుగా మూడు రూపాయిల స్టాంపులతో మీరు మీ బస్ట్‌సైజు ఫోటోలు రెండు, ఫుల్‌సైజు ఆరూ, సైడు పోజ్ మూడూ పంపండి" అన్న ప్రకటనకి వచ్చేటంత రెస్పాన్స్ కాకపోయినా అందులో సగమైనా యిలాంటి ప్రకటనలకు వస్తుందని "అనుభవజ్ఞులైన" పెద్దలు కొందరు చెప్పున్నారు.

'అయ్యా! యిదంతా వేరే కథగాని యిలాంటి యువ సాహితీ సంస్థలు సొంతంగా పెరగటానికి కొన్ని మంచి చిట్కాలున్నాయి. వీటికి ఖర్చులేదు ...సాహితీ సంస్థ ఏర్పడగానే సభ్యులంతా చెప్పానుగా "ఓ మాజీ రచయితను తెచ్చి కొబ్బరికాయకొట్టించేయడం— మంచిదే ...మరుసటి వారంనుంచి సభ్యులు సమావేశం కావాలి...వాళ్లల్లో ఒకరు గేయం, ఒకరు వ్యాసం ఒకరు కథ ఏదో వొకటి సొంతంగా రాసుకొస్తారుగా... వాటిని మిగతా నలుగురూ [పెద్ద రచయితల సమావేశాలల్లోలాగ] మైనర్ యూనిట్‌లుగా విడిపోయి గోష్ఠులు పెట్టకోకుండా — శ్రద్ధగా ఆలకించాలి... తర్వాత తెనుగులో చెప్పాలంటే సిన్సియర్‌గా, ఆనెస్ట్‌గా వాళ్ల వాళ్ల అభిప్రాయాలు — దూషణ భూషణలు లేకుండా చెప్పాలి. ఈ చెప్పడంకూడ ఒక 'కళ' ఇదికూడా వర్ధమాన రచయితలకు అలవాటు కావడం మంచిది — అభి ప్రాయానంతరం తిరిగి యీ రచయితలు వాటిని సరిదిద్దుకోవాలి... ఇదో మంచి పద్ధతి...

అలాగే సంతాప సభో లేదా సన్మాన సభో చేయడానికి ముందు— ఎవరికి సన్మానం సంతాపం చెప్పాలనుకుంటున్నామో వారి గురించి స్వయంగా తెలుసుకుని కొంచెం సభలకి వచ్చి నిర్వహించాలి. ఓ కవినో, ఓ రచయితనో పొగడ్డానికైనా తెగడ్డానికైనా అతనేం రాశాడో కొంచెం తెలుసుకోవాలి— ఇది రెండో పద్ధతి.

ఇక మూడో పద్ధతి వుంది... మంచి 'టెక్నిక్' తెలిసి రచనలు చేస్తూ— మిమ్మల్ని "కావర్స్" కీ "సిగార్స్" కీ "సిగరెట్‌లకి" ఐదేసి నిమిషాలకి వేధించకుండా మంచినీళ్లల్లో కూడా "కిక్కుంద"ని నమ్మే వో మోస్తరు పాపులర్ రైటర్ని దొరికినప్పుడు కొట్టుకొచ్చి ఆ సభలో మీ రచనమీద "స్పాట్ వాల్యూయేషన్" పెట్టుకోవాలి. మీ రచయిత పేర్లు అక్కరలేదు. మీ రచనల ఆతనికి వినిపించడం — ఆన్ ది స్పాట్ ఏనాలిసిస్ చేయించడం— ఇది బెటర్"—

సాహితీ సంస్థలవారంతా గోష్ఠులలో వచ్చే లాభాలు పై మార్గాలలో చేస్తే చాలా స్వల్ప వ్యయంతో సాహిత్య వ్యాసాంగంలో అధిక లాభాలుంటాయి— [ఆనక సంకలనాలు సంపుటాలు వేయడంవల్ల సాహిత్య వ్యాపారంలో స్వల్పాదాయాల్ని పొందవచ్చు] ఈ పద్ధతి బెస్టు... ఎందుకంటే యువతరంలో నున్న ఎన్నో రత్నాలు మణులు యీ పద్ధతిలో బయటపడ్డ సందర్భాలున్నాయి కనుక.

[వీరాజీ]





# రైలు ప్రయాణం

జె. భాగ్యలక్ష్మి

ఆ స్టేషన్లో రైలు రెండు నిముషాలే ఆగింది. రాత్రి ఎనిమిది గంట లయింది. అయినా ప్లాట్‌ఫారం మీద సందడే లేదు. కనీసం సిగరెట్లు అమ్మేవారు కాని, మరే తినుబండారాలు అమ్మేవారుకాని లేరు. అసలది రైలు స్టేషన్లాలేదు. రైలు కూతబెట్టి ముందుకు సాగింది. "రైల్వే కాంటీన్" అని పెద్ద బోర్డు కనిపించింద. చిన్న కొట్టులాంటిది. దాని తలుపులయితే మూసి ఉన్నాయిగాని ప్రక్కన ఫలహారాల బోర్డు మాత్రం పెద్ద పెద్ద అక్షరాలతో, వెలతో సహా కనిపించింది. రామమూర్తి నవ్వుకొన్నాడు.

రైలుస్టేషను దాటి వచ్చేసింది. అప్పుడే మరో వ్యక్తి లోపలికి వచ్చినట్లు గమనించాడు రామమూర్తి. అతను సన్నగా బక్క పలచగా ఉన్నాడు. ఉంగరాలజుట్టు చిన్న మొహం. చప్పి దవడలు. విచితంగా చూసే కళ్ళు.

రామమూర్తి జరిగి అతనికి చోటిచ్చాడు. అతని చిరునవ్వు ఆ మొహానికి వింత అందాన్ని ఇచ్చింది. లేకపోతే అతనిలో ఏ కోశానా అందం లేదనవచ్చు.

"ఎక్కడిదాకా ప్రయాణం" అని పలకరించాడు.

"హైద్రాబాదు" అన్నాడు రామమూర్తి.

"నేను అనంతపురం వెళ్తున్నాను" అన్నాడతను

రామమూర్తి "అలాగా" అన్నట్లు తల ఊపాడు.

"అక్కడే గవర్నమెంటు స్కూల్లో పని చేస్తున్నాను."

"భావి పౌరులను తీర్చి దిద్దుతున్నారన్న మాట."

"అబ్బే లేదు వారికి వంకర టింకర గీతలు నేర్పిస్తున్నాను."

"అదేం?"

"ఫ్రీ హాండ్ డ్రాయింగ్" అంటూ నవ్వాడు.

"చిత్రకారులా?"

"డ్రాయింగ్ నేర్చిన ప్రతివాడూ చిత్రకారు డయితే ఇంకేముంది? కలం పట్టిన ప్రతివాడూ కవి కాగలడా?"

"ఈ కాలం కవులెక్కువ పాఠకులు తక్కువ అనాలి"

"తప్పు తప్పు. రచయిత్రు లెక్కువ పాఠకులు తక్కువ అనాలి."

"ఏం రచయిత్రులమీద దాడి చేశారు?"

"వారు నవలలు వండుతారని విన్నాం" అన్నాడు నవ్వుతూ.

"అవును మరి బయటి సంపాదన రచయితలదయిపోయె. రచయిత్రులది స్వయం పాకమైనందుకు సంతోషించాలి."

మాటలు సాగుతూ ఉన్నా ఆ వ్యక్తి చేతిలోని నోటు బుక్కుపై పెన్సిలుతో ఏవో గీతలు గీస్తూనే ఉన్నాడు. ఇప్పుడది రామమూర్తికి ఇచ్చాడు.

"ఎంత త్వరగా నా స్కెచ్ వేసేశారు! వండర్‌ఫుల్! ఓహో మీ పేరు రంగనాథమా?"

"అవున" న్నట్లు తల ఊపాడు.

"మీ పేరు?"

"రామమూర్తి."

"ఈ స్కెచ్ నిజంగా ఎంతో బాగుంది" రామమూర్తే అన్నాడు.



రుచికరమైన, పుష్టికరమైన
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు
B
BRITANNIA
BISCUITS
BRITANNIA
Glaxo
BISCUITS
పెరిగే పాపాయిలకు
రుచివంతమైన తోడు
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు మరీ అంత ప్రత్యేకమైన రుచి గలిగి ఉండటానికి ఏమిటి కారణం? వాటిలో గల సమృద్ధినిచ్చే, సంపూర్ణమైన పుష్టినిచ్చే లక్షణాలే. పిల్లలకు యివి యిష్టం, పెరుగుతారు ఎంతో బాగా వాటితో. బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు ఎదిగే మీ పిల్లలకు ఎంతో మంచివి
బ్రిటానియా
బిస్కట్లు అత్యుత్తమమైనవి
లింటాస్-BBC.GLX-6-140 TL

"మీరు బాగున్నారు గనుక"

రామమూర్తి ఆ మాటలు విననట్లు చేతిలోని పత్రిక పేజీలు తిరగవెయ్యసాగాడు.

"ఇంత టాలెంటు ఉంది. ఏ న్యూస్ పేపర్లోనో కార్టూనిస్టుగా చేరకూడదూ"

రైలు ప్రయాణం

అన్నాడు.

"ఇందాకా చిత్రకారునిగా అందలమెక్కించి ఇంతలో కార్టూనిస్టుగా కిందకు దింపు

తున్నా—"

"నో . నో.. కార్టూనిస్టు ఏ చిత్రకారుడికీ తీసిపోడు. అంతేగాక చిత్రకారుడికంటే ఎక్కువ బుర్ర ఉండాలి. చూడండి ఈ వార పత్రికే చూడండి. ఇందులో ఈ కార్టూన్

నాకు చాలా నచ్చింది. దీనిలో నింత సున్ని తంగా కార్టూనిస్టు తన భావం చెప్పాడో చూడండి.''

రంగనాథం ఆ కార్టూన్ చూశాడు—తన చేతిలోని పెన్సిల్‌తో ఆ లైన్సు మరింత కొట్టొచ్చేటట్లు దిద్దాడు. యథాలాపంగా పేజీ తిరగవేసి అక్కడో కథలు చూసి అర్థ వంతంగా నవ్వాడు.

''ఎందుకు నవ్వుతున్నారు?'' అని రామ మూర్తి అడిగాడు.

అక్కడ రచయిత్రి పేరు క్రింద గీత గీస్తూ ''ఈమె నాకు బాగాతెలుసు'' అన్నాడు.

''అలాగా?'' అన్నాడు రామమూర్తి.

''అలాగా అని తేలికగా తీసి వెయ్యకండి. మాది చాలా గట్టి బంధం.''

రామమూర్తి ఇప్పుడూ మాట్లాడలేదు.

''మీకు రొమాన్సులంటే ఇష్టమా?''

''రొమాన్సంటే చాలా అర్థాలున్నాయి. ఇష్యను, ఫ్రెంచి భాషలో మామూలు నవలనే 'రొమాన్స్' అంటారు. ఫ్రాన్సులో మాట్లాడే ఒక భాషను రొమాన్సు అంటారు. సత్యానికి దూరమైన కల్పితాన్ని రొమాన్స్ అంటారు.''

''సార్. సార్. మా ఇంగ్లీషు మాస్టారి కంటె ఎక్కువ అర్థాలు చెబుతున్నారు. నేను అడిగేది మామూలుగా మనకు అర్థ మయ్యే రొమాన్స్... అంటే నవలా భాషలో ప్రేమాయణం అనుకోండి.''

''ఎవరి ప్రేమాయణం? మీదా?నాదా?''

''ఓహో మీకూ ఓ ప్రేమకథ ఉందన్న మాట.''

''ఏం అంత అన్ రొమాంటిక్‌గా కని పిస్తున్నానా?''

''అబ్బె అలా అని కాదు. చాలా జెంటిల్ మాన్‌లా ఉంటేనూ...''

''జెంటిల్‌మెన్ ప్రేమించరా? అనా మకులు, రౌడీలూ, గూండాలూ ప్రేమి స్తారా?''

''ఓ గాడ్ మీరు కూడా ప్రయత్నిస్తే రచయిత కావచ్చు సార్. కనీసం రచయిత్రి గారి భర్తగానైనా రాణిస్తారు.''

''థ్యాంక్యూ.. థ్యాంక్యూ. ఇక మీ ప్రేమ కథ మొదలెట్టండి!'

''ఏకథ అని చెప్పమంటారు? పోనివ్వండి ఈ రచయిత్రి గురించే చెప్పుకొందాం. రాజీ నేనూ ఒకే స్కూల్లో చదువుకొన్నాం. తను స్కూలుఫైనలుకు వచ్చేసరికి అరవిచ్చినగులాబీ మొగ్గలా తయారయింది. మొట్టమొదటి సారిగా తన హృదయాధిపతినైన ఘనత నాకే దక్కింది''

''మరి ఆ ఆధిపత్యం ఎందుకు వదులు కొన్నారు?''

''ప్రేమ కథలు ఎప్పుడూ సాఫీగా సాగవు సార్. అలా జరిగితే అవి ప్రేమకథలే కావు... ఆ రోజుల్లో ఒకర్ని ఒకరు ఎంత చూసు కొన్నా తనివి తీరేదే కాదు . ఎన్ని కబుర్లు చెప్పుకొన్నా ఇంకా మిగిలిపోతూనే ఉండేవి మా స్నేహం చూచి చాలామందికి కన్ను కుట్టింది. కొందరు స్నేహితులు మొరటుగా పరిహాసాలు కూడా ప్రారంభించారు. నేను అందరికీ తెగేసిచెప్పాను 'రాజీ నేనూ ప్రేమించు కొన్నామ'ని. రాజీ మాత్రం సూటిపోటి మాట లకు తట్టుకోలేక పోయింది. అప్పటి నుండి మాటల బదులు ఉత్తరాల పరంపర ప్రారంభ మైంది ఎన్నిచోట్ల చాటుగా కలుసు కొన్నామో. ఎన్నిసార్లు తన బుగ్గలు ...'' ఇక్కడ రంగనాథం ఆగి అర్థవంతంగా నవ్వాడు.

రామమూర్తి నవ్వాడు ''కానివ్వండి.''

''ఒకసారి ఊరి బయట మామిడి తోటలో మా సంకేత స్థలంలో కలుసుకొన్నాం. మా కబుర్లలో మేము మునిగి వాళ్ళ నాన్నగారు రావటమే గమనించలేదు. రాజీ మా తం గజగజ వణికిపోయింది. ఆ తర్వాత వారం రోజులు కలవలేకపోయాం. ఇంతలో పరీక్షలు వచ్చేశాయి. తనను తిరిగి పరీక్ష హాల్లోనే చూశాను. ఏడ్చిఏడ్చి ఉబ్బిన కళ్ళతో ఏలాగో ఉంది. పరీక్షలు కాగానే ఫలానా చోట కలుసుకోమని చీటీ పంపించాను.

అది నా మిత్రుల గది వాడు మమ్మల్ని ఒంటరిగా వదిలి తెలివిగా జారుకొన్నాడు. రాజీ కన్నీరు మున్నీరై ఏడ్చింది. నిజం చెప్పొద్దూ నాకూ చాలా బాధనిపించింది. వాళ్ళమ్మా నాన్నా బాగా కోప్పడ్డారట. నానా మాటలూ అన్నారట. ''కన్న తల్లిదండ్రులే తను పిల్లల్ని అలా నిందించగలరని నేనెప్పుడూ ఊహించలేదు.'' అంది ఏడ్చిబడ్డ కళ్లను తుడుచుకొంటూ. రాజీ ఎప్పుడూ వెర్రి నాలోకమే. పుస్తకాల్లో మాదిరి మాట్లాడు తుంది. చేతలూ అంతే. వాళ్ల నాన్నగారు బదిలీ చేయించుకొన్నారట. ''ఇంకెప్పటికీ కలుసుకోలేమేమో!'' అంది నా జుట్టు నిము రుతూ. ఆ రోజు ఆ ఒక గంటా వృథా చేసుకో దలచలేదు నేను. దొరికిన అపూర్వావకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నాం. ఒకరి సాన్ని ధ్యంలో మరొకరు మైమరచాం. స్వర్గానికి నిచ్చెనలు వేశాం. క్లుప్తంగా చెప్పాలంటే ..''

''చాలు చాలు. అర్థమయింది'' అన్నాడు రామమూర్తి ''ఇంతకూ మీ ప్రేమకథ జరిగి ఎన్నాళ్లయింది?''

''ఇప్పటి మాటా? అప్పుడు నాకు పద్దెనిమిదేండ్లు. ఇప్పుడు ముప్పయి. అంటే పన్నెండేళ్ళనాటి మాట.''

''తర్వాత మీ రెప్పుడూ కలుసుకోలేదా?''

లేదని తల అడ్డంగా ఊపాడు.

''కనీసం ఉత్తరాలైనా వ్రాసుకోలేదా?''



## రైలు ప్రయాణం

"లేదు. కాని ఎనిమిదేళ్ళ క్రితం ఒకసారి ఆమెకో పెళ్ళి సంబంధం వచ్చింది. అనుకోకుండా అతన్ని మా బంధువుల యింట్లో కలుసుకొన్నాను. అతనే చెప్పాడు ఫలానావారి అమ్మాయిని చూడటానికి ఫలానా ఊరు వెళ్తున్నానని. చాలా సరదా అయిన మనిషి. ఆ రాత్రి కాస్త సంబరం చేసుకొన్నాం. ఎందుకో ఆ రాత్రి రాజీ పరాయి సొత్తు కాబోతుందనే భావనే భరించలేకపోయాను. అందుకే అతనికి నేనూ రాజీ ఎంతగా ప్రేమించుకొన్నామో చెప్పాను. తను నాకు వ్రాసిన ఉత్తరాలు చూపించాను. ఆ తర్వాత అతను వెళ్ళాడో, రాజీని చూశాడో లేదో నాకేమీ తెలీదు. నాలుగయిదేండ్లుగా రాజీ కథలు, నవలలు చూస్తున్నాను. గడచిన రోజులు నెమరవేసుకొంటుంటాను... ఎలా ఉంది సార్ నా ప్రేమ కథ ?"

"బ్రహ్మాండంగా ఉంది. అయితే మీరు కాస్త ట్రాజిక్ హీరోగా మారి ఉంటే కథ మరింత రక్తి గట్టేది."

"మరీ చురుకుగా తగిలిస్తారండోయ్, సరేసరే మీ కథ చెప్పండి."

"నాదేముందిలెండి – మీ కథలా మలుపులు తిరిగి జిలుగులు సంతరించుకోలేదు. 'బాబీ' సినిమాలోని టీన్ ఏజ్ ప్రేమ కూడా కాదు తనూ, నేనూ ఒకే ఆఫీసులో పని చేస్తున్నాం. ఒకరి కొకరం దగ్గరయ్యాం. కలిసి జీవిస్తే బాగుంటుందను కొన్నాం. పెళ్ళి చేసుకొన్నాం అంతే."

"చప్పచప్పగా ఉంది. కష్టాలూ, కన్నీళ్ళూ లేకపోతే అదీ ఒక ప్రేమ కథేనా ? మీ ప్రేమకు అడ్డంకులే లేవా ?"

"కులం వగైరాలు అడ్డంకులని మీరనుకొంటే మాకూ అడ్డంకులు వచ్చాయనే చెప్పవచ్చు. గట్టిగా పట్టుబడితె, ఆత్మ విశ్వాసం ఉంటే మనం సాధించలేనివి ఏముంటాయి ? గుండెబలం, కండబలం ... అంటే ఆర్థికస్తోమత ఉంటే చాలు."

"మీ కథ సుఖాంత మన్నమాట."

"ఇంకా అంతం కాలేదు. సుఖంగా అయితే సాగుతోంది. జీవితంలో కన్నీళ్లు లేకపోలేదు. ముఖ్యంగా మా ఆవిడ జీవితంలో. కాని మేమిద్దరం కలిపి ఆ కన్నీళ్లను ఆనందబాష్పాలుగా మార్చుకొన్నాం"

"చాలా మిస్టీరియస్‌గా ఉంది."

"మీ మిస్టరీ విడగొట్టాను. మీరిందాకా చెప్పిన 'రాజీ' నా భార్యే." రామమూర్తి అతని కళ్లలోకి చూస్తూ చెప్పాడు.

రంగనాథం తెల్లబోయాడు.

"ఇప్పుడు చెప్పండి. మీ ప్రేమ కలాపాలు నిజమైనవేనా ?"

"కాక ?" కాస్త బింకంగా అన్నాడు.

"మీ దవడ వాయగొట్టటానికి నా సంస్కారం అడ్డొస్తోంది లేకపోతే మిమ్మల్ని విసరి రైల్లో నుంచి పారేద్దును."

రంగనాథం లేచి నిలబడ్డాడు. అనంతపురం స్టేషను దగ్గరపడుతున్నట్టుంది.

రామమూర్తి అతన్ని లాగి కూర్చోబెట్టాడు. "కాస్త ముఖ పరిచయమున్న ప్రతి అమ్మాయీ తనను ప్రేమించిందని, పేరు తెలిసిన ఆడపిల్లలంతా తనతో ప్రేమ కలాపాలు జరిపారని డంబాలు పలికే హీరోలు మనలో చాలామందే ఉన్నారు. ఎదిగీ ఎదగని మనస్సులో స్నేహభావం విచ్చుకొన్నంత మాత్రాన దానికి మీరింతగా చిలువలు పలవలు చేర్చి చెప్పాలా? నిజం చెప్పండి. మీమూలంగా రాజీ ఎన్ని అవమానాలు భరించిందో ఎన్ని

### భిక్షువు

సోదరా!
అడుక్కుంటున్నావెందుకు?
ఏ చిటి నీలోని లోపం
నీ అవయవాలు చచ్చి పోయాయా!
లేదు.
నాకు తెలుసు
అంతరంగం పుచ్చిపోయింది!!
చిత్తంలోని 'అభిమానా'న్నంతటినీ
పీల్చివేసి
'సోమరితనం' పెద్దగా త్రేన్చింది.
అవిటివనని, చెవిటివనని,
అంధుడినని, అనాధనని
లోకం కళ్లకి అబద్ధాల తెరలు కప్పుతున్నావా
స్వేదం లోనే 'అపునృత్యవేదం' ఉందని
తెలుసుకో.
నీ పాత్రలో అన్నం వేయడానికి బదులు
'హృదయపాత్రలో' ఎవరైనా
'జ్ఞానాన్నం' వేస్తే
"తిట్టి పోస్తున్నా"రని ముఖం చిట్లించుకోక
కష్టించి జీవితాన్ని గెలుపు
జాతికి అప్పుడె వెలుగు.

–చిట్టిప్రోలు వెంకటరత్నం

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే 'యింధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

మీ కార్యక్రమాన్ని ప్రతి రోజూ ఉత్సాహంగా ప్రారంభించడంకోసం మీకు కూడా, రైలు మాదిరిగా, యింధనం కావాలి. శక్తినిచ్చే యింధనం మిమ్మల్ని రోజల్లా చురుకుగా వుంచి చకచకా పనులు చేసుకునేటట్లు చేస్తుంది. అందుచేతనే ప్రతి ఉదయం మీకు బూస్ట్ కావాలి. ముఖ్యంగా చదువులోనూ, ఆటల్లోనూ అదనపు శక్తిని వినియోగించే మీ పిల్లలకి కావాలి. వారికి బూస్ట్ యివ్వండి. ఇది కొత్త మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసినది.
బూస్ట్‌ని పూర్తి మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో తయారు చేశారు. ఇందులో సహజమైన విటమిన్లు, ఖనిజాలు వున్నాయి.

> బూస్ట్‌లో, యిటువంటి మరే యితర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పాలు వున్నాయి. బూస్ట్‌లో మరింత ఎక్కువగా పాలు వున్నాయంటే, మీ పిల్లలు పెరగడానికి మరింతగా పోషణ పదార్థాలు, మరింతగా మాంసకృత్తులూ లభిస్తాయన్నమాట. బూస్ట్‌లో ఎక్కువగా పాలు వుండటంవల్ల ఎక్కువగా మీగడగా వుంటుంది. మీకు ఆ రుచి తెలుస్తుంది.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా ఎంతో యిష్టపడే మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన వున్నాయి. మీ రోజుని ప్రారంభించేందుకు యిది ఉల్లాసమైన మార్గం — ప్రతి రోజూ.

రెండు సైజులలో లభిస్తుంది.

**'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.**

R 4193-Tel

శపని దలపాలయిందో. మేకవన్నె పులిలా తన
ఏరించి కథలు ప్రచారం చేసింది మీరు
గాదూ! లేని రొమాన్సుకు ఊహల రంగులద్ది
కథలు కథలుగా చిత్రించింది మీరు కాదూ?
ఏదో పెళ్లి సంబంధం వస్తే అవాకులు,

## రైలు ప్రయాణం

చెవాకులు చెప్పి అతని మనసు విరిచింది మీరు
కాదూ?"

"ఇలాగని రాజ్యలక్ష్మి చెప్పిందా?"

"చెప్పాలా? మీ మాటల ధోరణి చూస్తే
ఎవరికైనా అర్థమవుతుంది. పెద్ద మజ్నూలా
సోజుకొడ్తే మాత్రం బండారం బయట పడ
దనుకొన్నారా? ముక్కూ మొహం తెలీని నా
దగ్గరే ఇన్ని కథలు చెప్పిన మీరు పన్నెండేళ్ల

క్రితం మీ స్నేహితులతో, పరిచయస్థులతో ఎన్ని దంబాలు పలికి ఉంటారో నేను ఊహించలేననుకొన్నారా?"

రైలు వేగం తగ్గింది. రంగనాధం తిరిగి లేచి చేతిసంచి అందుకొన్నాడు "మేము ప్రేమించుకొన్న మాట వాస్తవం నమ్మితే నమ్మండి, నమ్మకపోతే పొండి" అన్నాడు గొణుగుతున్నట్లు.

రామమూర్తి కళ్ళు నవ్వుతో మెరిశాయి "చిన్నతనంలో ఒకరిమీద ఒకరికి కలిగే ప్రేమాభిమానాలను 'కాఫ్ లవ్' అంటారు కాని 'ప్రేమాయణం'గా ఎవ్వరూ వర్ణించరు మన సమాజ వ్యవస్థే అలా అఘోరించింది ఒక అబ్బాయి, అమ్మాయి, ఏ వయస్సులో ఉన్నాసరే, ప్రేమ ముద్ర పడకుండా ఒకరి నొకరు అభిమానించు కోటానికి వీలులేదు. కాకపోయినా ఆప్యాయత అనేది అపురూపంగా దొరుకుతుంది దానిని పదిలంగా హృదయాంతరాళంలో దాచుకోటం నేర్చుకోవాలి. ఆ ప్రేమ కుసుమాన్ని పదిమంది ఎదుటా ప్రదర్శిస్తే అది వాడి నలిగిపోతుంది'

రైలు ఆగింది. రంగనాధం వెళ్ళబోతూ వెనక్కి తిరిగి, "ఈ విషయాలన్నీ మీ ఆవిడతో చెప్పండి" అన్నాడు

"ఏం? మీరెంత దగజారారో తనకు తెలిసిపోతుందని భయమా? షి స్టిల్ రెస్పెక్ట్స్ యు యాజ్ ఎ ఫ్రెండ్. మీ చిత్రకళ పట్ల తనకింకా అభిమానముంది. నమ్మిన వాళ్ళకు వెనకపోటు పొడవటం స్నేహధర్మమా?"

"క్షమించండి" రంగనాధం దిగిపోయాడు.

రైలు కదిలింది.

"ఏమండోయ్" అని చప్పట్లుకొట్టి పిలిచాడు రామమూర్తి.

అయిష్టంగా కిటికీ దగ్గరకు వచ్చాడు రంగనాధం.

"నిజానికి రాజ్యలక్ష్మి ఎవరో నాకు తెలీదు" అన్నాడు చేయి ఊపుతూ. రంగనాధానికి రైలు శబ్దంలో ఆ మాటలు సరిగా వినిపించలేదు

"రాజ్యలక్ష్మిని అడిగానని చెప్పండి" అంటూ అతను కేక పెట్టాడు.

## స్కోరెంత? - 4

### తిరోగాముడు!

కాలిఫోర్నియావాసి ఐన 'ప్లెన్నీవింగో' వెనక్కి నడుస్తూ ఎన్ని వూళ్ళైనా తిరుగగల "ఛాంపియన్". ఇతను 45 సంవత్సరాల క్రితమే వెనక్కి నడుస్తూ "సాంటామోనికా" నుంచి "ఇస్తాన్‌బుల్"దాకాగల 8 వేల మైళ్ళ దూరం ఒక్కడుగు కూడా ముందుకు వేయకుండా చేరుకున్నాడుట! ఇతని వయసు యిప్పుడు 81 సంవత్సరాలు– ఇతని స్కోరెంతో "రిప్లీ" గారి "నమ్మూనమ్మకపో" పుస్తకాల్లో వుంటుంది. ఇప్పుడు ఈ రిప్లీ సంస్థ వారి ప్రతిపాదనమీద 81 సంవత్సరాల వయస్సులో "ప్లెన్నీ"గారు కాలిఫోర్నియా తీర ప్రధాన మార్గం మీద జులై 31 న వెనక్కి నడక ప్రారంభించాడు. అతను అలాగే 400 మైళ్ళు తిరోగమనం చేస్తాడట! వెనక్కి నడవటంలో యితనిమీద స్కోర్ చేయగలవారున్నారా? అని. ★

## అవీ - ఇవీ - అన్నీ

### జీవితం నేర్పిన పాఠాలు

నమ్మిన సిద్ధాంతాన్ని లేక సత్యాన్ని ముందుగా తాను ఆచరించి ఇతరులకు మార్గదర్శకం కావడం అన్నది చాలా అరుదు. కీ. శే. గోరా తాము నమ్మినదాన్ని ముందు తాము ఆచరించి చూపిన వ్యక్తి. ఆయన తమ జీవితానుభవం ద్వారా నేర్చుకున్న పాఠాలని ఉపన్యాసాలద్వారా, వ్యాసాలద్వారా వెలబుచ్చారు. వాటిలో కొన్నిటిని ఈ పుస్తకంలో పొందుపరిచారు

నాస్తిక కేంద్రం, పటమట, విజయవాడ–6 వారు ప్రచురించిన 120 పేజీలుగల ఈ పుస్తకం వెల మూడు రూపాయలు.

### కొత్తపాళీలు

వచన కవితా సంకలనం

సంకలన కర్త శ్రీ బులుసు వెంకట కామేశ్వరరావు 104 పేజీలు, వెల 4 రూపాయలు ప్రచురణ: సీతా పబ్లికేషన్స్ 74, అరండల్‌పేట, గుంటూరు–2.

## అవీ ఇవీ—అన్నీ

### అజ్ఞాత బంధం

నవల. రచన శ్రీ చిట్టూరి 182 పేజీలు, వెల 8 రూపాయలు, ప్రతులకు లక్ష్మీ బుక్ సెంటర్, వెంకటేశ్వర నగర్ కాకినాడ.

ఆశతోటే మనిషి బ్రతుకుతాడు మమతలు, బంధాలు వ్యక్తుల జీవితాలపై అజ్ఞాతంగా తమ ప్రభావాన్ని ప్రదర్శిస్తూనే ఉంటాయి. అదృష్ట దురదృష్టాల దాగుడు మూతల వెనుక సర్వాంతర్యామిలా అజ్ఞాతబంధం ఆశీర్వాదం ఉండనే ఉంటుందన్న సత్యాన్ని రచయిత ఈ నవలలో చక్కగా చిత్రీకరించారు.

### ప్రేమదాసు

వెండి తెర (క్రై) నవల రచన. ప్రచురణ యర్రా కృష్ణార్జునరావు 150 పేజీలు. వెల 4 రూ. లు ప్రతులకు: రచయిత, ఎ. ఎన్. ఆర్. పవర్ ప్రెస్, కొత్తపేట, తెనాలి.

ప్రేమలో విషాదాన్ని ప్రదర్శింప చేయడమే కాక విభిన్న పాత్రలద్వారా మిగిలిన రసాల్ని కూడా ప్రతిభావంతంగా పోషింపజేసిన రచయిత రచనా పాటవం సంభాషణాచాతుర్యం చదువరులకు సినిమా చూస్తున్న అనుభూతిని కల్గిస్తాయి. సినీ టెక్నిక్‌తో వ్రాసిన ఈ నవలని నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావుకి అంకిత మివ్వడం సమంజసంగా ఉంది.

### మంచికోడలు

కథ. స్క్రీన్‌ప్లే మాటలు లేక నాటకం నవల సినిమా రచయిత: శ్రీ యర్రా కృష్ణార్జునరావు 120 పేజీలు, వెల 6 రూ. లు, ప్రతులకు రచయిత, అసోసియేట్ డైరెక్టర్ కేరాఫ్ శ్రీ కె. వరప్రసాదరావు, సినీ డైరెక్టర్, వీనస్ స్టూడియో, మదరాసు 18 లేక రచయిత, అత్తోట, తెనాలి తాలూకా, (గుంటూరు జి.)

### సాహితీ స్రవంతి

సాంస్కృతీ సమాఖ్య, విజయవాడ వారు తమ మూడవ ప్రచురణగా విడుదల చేసిన మినీ కవితల సంకలనం ఇది. అభ్యుదయ భావాలు గల యువ రచయితల కవితలు రెండు తక్కువగా వంద ఉన్నాయిందులో. 56 పేజీలు, వెల రూపాయిన్నర. వివరాలకు ప్రధాన కార్యదర్శి, సాంస్కృతీ సమాఖ్య విజయవాడ; కేరాఫ్ పిన్‌కోడ్ నెం. 521 212 కి వ్రాయాలి

### జీవన మాధురి

నవల. రచన: శ్రీమతి హజరా, 196 పేజీలు, వెల రు. 7-50. ప్రచురణ: శ్రీ కవితా పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.

అంతు లేని సంపద, ఆత్మీయుల అనురాగం, ఆప్త మిత్రుల అభిమానం ఎన్ని ఉన్నా స్త్రీ తన కత్యంత ముఖ్యమైన దాంపత్యంలో భర్త నిరిప్తతకు, నిరాదరణకు గురియైతే దానికి పరిష్కారం ఎవ్వడగాలి? ఎవరితోనూ చెప్పుకోలేని సున్నితమైన ఈ సమస్యకు పరిష్కారం ఎలాకుదిరింది అన్న విషయాన్ని నవలలో రచయిత్రి ఎంతో నేర్పుతో, ఉత్కంఠత కలిగించే విధంగా చిత్రీకరించారు.

# ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

## వసూళ్ళ చక్రవర్తి

3-12-1976 సంచికలో ఉత్తరాలశీర్షికలో ఎస్. మురళిగారి లేఖ చూచి ఎంతో నవ్వుకున్నాం. వసూళ్ల చక్రవర్తి గురించిన వాగ్వివాదం చాలాకాలం నుండీ గమనిస్తూనే ఉన్నాం. శ్రీనివాస్ గారి అభిప్రాయం తిరుగులేదని చెప్పవచ్చు. ప్రస్తుతం చిత్రపరిశ్రమలోని వసూళ్లను గురించి వారు రాసింది ఎంతో నిజం. మురళిగారు ఎప్పుడో విడుదలయిన 'దసరాబుల్లోడు' 'ప్రేమ్‌నగర్' చిత్రాలను గురించి చెప్పారు. కాని, అంతకు ముందు సినీపరిశ్రమలో రికార్డు సృష్టించిన 'లవకుశ'ను వారు మర్చిపోయి వుంటారు. అవును!...నిస్సందేహంగా మర్చిపోయి వుంటారు. శ్రీనివాస్ గారు ఎప్పటి కప్పుడు సరికొత్త సమాచారాన్నందిస్తారు దాన్నిబట్టి వారి అభిప్రాయాన్ని ప్రస్తుత కాలానికి అన్వయించుకోవడం సబబుగా వుంటుంది. 'ఎదురు లేని మనిషి' పట్ల శ్రీనివాస్‌గారి అభిప్రాయం తిరుగులేనిదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఎ. శ్యామ్ ప్రభాకర్ (హైదరాబాద్.)

* * *

ఈ విషయమై నాగేశ్వరరావుగారి అభిమాని ఎస్. మురళి (గుంటూరు) గారిలేఖచూసిన తర్వాత నేను రామారావుగారి అభిమానిగా ఉత్తరం వ్రాయ లేకుండ ఉండలేక పోయాను. నాగేశ్వరరావుగారి "దసరాబుల్లోడు"కి వచ్చిన వసూళ్లు ఏ చిత్రానికి రాలేదని అన్నారు. కాని ఇంతవరకు రామారావుగారు నటించిన "లవకుశ" చిత్రానికి వచ్చిన వసూళ్లు తెలుగు చలనచిత్ర చరిత్రలో ఏ చిత్రానికి రాలేదని విజ్ఞప్తి చేస్తున్నాను.

ఎం. ఎస్. పాత్రుడు, (విశాఖపట్నం.)

* *

శ్రీ ఎన్టీఆర్, శ్రీ శోభన్‌గార్ల సినిమా కలెక్షన్స్ గురించిన కాంట్రోవర్సీ మన యువతరానికంత అర్థవంతమైనదీ కాదూ, ఆరోగ్యవంతమైనదంత కంటే కాదు. ఇంతకంటే, "పత్రిక"ల లోని సాహిత్యాన్ని గూర్చి చర్చ అత్యంత అభిలషణీయం.

ఎం. అప్పారావు, ఎం. ప్రభాకరరావు, పి.కొండలరావు, (శ్రీకాకుళం.)

## అందరూ వసూళ్ల చక్రవర్తులే!

శోభన్ అభిమానులు, రామారావు అభిమానులు, ఇప్పుడు నాగేశ్వరరావు అభిమానులు ఎవరికివారే మా హీరో వసూళ్ల చక్రవర్తి అని రాసుకుంటున్నారు. రేపు కృష్ణ అభిమానులు రాసుకుంటారు. కాని నిజమేమిటంటే ఎవరి చిత్రాలకు ఎక్కువ కలెక్షన్లు వస్తే వారు వసూళ్ల చక్రవర్తులే! ఈరోజు రామారావు చిత్రాలకు నిన్న శోభన్ చిత్రాలకు,మొన్న నాగేశ్వరరావు చిత్రాలకు, కలెక్షన్లు ఎక్కువే వచ్చాయి. కాబట్టి అందరూ వసూళ్ల చక్రవర్తులే!

డి. దుర్గరాజా రాజమండ్రి.

[ఇంతటితో యీ వివాదం ముగిస్తున్నాము. – సం.]

కుని జీవికకు బయలుదేరారు. బ్రిటిష్ సర్వీసులో చేరడం ఇష్టముండేదికాదు. కనుక గుంటూరు లోని టుబాకో మార్కెటింగ్ కమిటీ పొగాకు లోకం పత్రికను 1946-56 నడిపారు

## హైదరాబాద్ నోట్ బుక్

(18వ పేజీ తరువాయి)

తాడికొండ మొదలైన గ్రామాలలో పొగాకు సూప రింటెండెంటుగాను పనిచేశారు. 1956 ఆంధ్ర ప్రభుత్వం సమాచార, పౌర సంబంధాల శాఖలో ట్రాన్స్‌లేటర్‌గా చేరి, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక సంపాదకులుగా ఉన్నారు. జపాన్ ప్రతికూల ప్రచారంలో నెహ్రూ విజయవాడ వచ్చి నప్పుడు, పద్యాలు చెప్పారు. 1938-39లు సన్‌యట్‌సేన్ సతి చెప్పె వింటిరి గదా అంటూ ఇది ఆయన తొలిపద్యం. మొదట్లో రాయప్రోలు ప్రభా వంతో రసధుని, అనూనాస్త్రప్రేయసివంటి రొమాం టిక్ ఖండికలు రచించారు. విశ్వనాథ ప్రభావంతో సేప్తికంవంటి కావ్యాలు వృత్తాలతో నడిపించారు. ఇదంతా 1943కు ముందు "మాత్రాచ్ఛంద స్సులో ఈయన తొలి గేయం "బానిసలం బానిసలం, బ్రతుకంతా గుదికట్లు" అనేది. 1941లో వాణి పత్రికలో ప్రచురితమయింది మొదటి ప్రచురణ సరిగాగరా 1941లో. బెల్లంకొండ రామదాను, సుబ్రహ్మణ్యంతో కలిసి ఈ ప్రచురణ జరిగింది. 1949లో 'తెలంగాణ' రచన ప్రారంభమయింది. 1956లో ప్రచు రణ. 1957లో ఆశ ఫీవర్స్ నాటకం. యుగే యుగే 1958. నగరంలో వాన 1966, దీనికి 1969లో అతర్జాతీయశాంతికి దోహదం చేసేదిగా గుర్తించి 69లో సోవియెట్ బహుమతి 1970లో రాష్ట్ర సాహిత్య అకాడమీ కవితా బహుమతి వచ్చాయి. ఆంధ్ర జనతలో వారం వారం కవితాకాలం నడిపారు. తరువాత వ్రాసినవి మహాత్మ గీతం. దండి యాత్ర మొద లైనవి. శిష్ట - పూర్తి వచన కవితా నాటకం ఇంతకుముందు చెప్పిన ఆశలో కాలం, చరిత్ర ఆశ, కవి, పాత్రలు. బ్యాంకిమన్ రామనాథం విలన్. నిరుడు 1975లో 'కుందుర్తి కృతులు' పేర 950 పుటల 14 కావ్యాలు ఇతర ఖండికల సంకలనం ప్రచురించారు. పాశ్చాత్య ప్రభావంలో పడి, అర్థంకాని సంకే తాలు పెట్టుకుని కవితను క్లిష్టం చేయకండని యువకులకు కుందుర్తి సలహా. కుందుర్తి నిరం తర భావుకుడు. ఆయన కలం ఇంకా అనంతమైన వచన కవితలు వర్షించాలి.

ఉపశ్రుతి :

"కుటుంబ నియంత్రణ యజ్ఞం మహోగ్రంగా సాగుతున్నదోయ్, మన రాష్ట్రంలో "అన్నాను.నేను, ఒక కార్యకర్తతో ప్రశంసాపూర్వకంగా "అవు నవును, ఆ మధ్యన అల్లూరు సీతారామరాజుతో పాటు పనిచేసిన 80 సంవత్సరాలవృద్ధుడు పండయ్యకు కూడ చేశారట ఆపరేషన్" అన్నాడు ఒక పౌరుడు. "80 సంవత్సరాల ముసలాడికి ఎందుకు ?" అన్నాను "నాకేం తెలుసు సీతా రామరాజు స్మారక సంఘం కార్యదర్శి శ్రీ బి. సూర్యనారాయణగారిని (కాకినాడ) అడగండి" అన్నారు ఆయన.

—తిరుమల రామచంద్ర



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

[...] ENGLISH STUDIES
No. 17, F[...] Main Road, LAKE AREA,
Nungambakkam, MADRAS-600 034
Beside VALLUVAR KOTTAM

ART IS LONG! LIFE IS SHORT.
HENCE, LIVE TO LEARN.

16 ఏండ్ల వయస్సునకు పైబడినవారు

# ఒకే సంవత్సరములో

ఆంగ్లములో సంభాషించుటకును,
పరిచయముచేసికొనుటకును,
తపాలా ద్వారా విశ్రాంతి సమయములో





ప్రారంభమునుండి కాని - లక్ష్యలక్షణ పరిశోధన పద్ధతిలో కాని

# ఇంగ్లీషు

నేర్చుకోవచ్చును.

ప్రారంభించు క్రొత్త తరగతుల[...]
నేరుగా వచ్చికాని,
20 పైసల తపాలాబిళ్లతో[...]
లేఖను వ్రాసికాని పూర్తి వివర[...]
తెలిసికొనండి. వెంటనే చేర[...]



సర్కసు ఆవరణములో చేతిలో తెరువబడిన రంగుల గొడుగుతో అందమైన అమ్మాయి తీగపైన వయ్యారముగా నడచుచున్నది. ఆమె బరువును వహించిన ఆ తీగ కొరకు పశ్చాత్తాప పడితిని. మంచివేళ! ఆమె తక్కువ దుస్తులు ధరించియున్నది. ఎక్కువ దుస్తులు ధరించియున్నచో ఆ తీగ ఏమై యుండును? ఇది నా బాల్యములో రేకెత్తిన ప్రశ్న. ఇప్పుడు అది తలచుకొని నవ్వుకొందును. లోలోపల నవ్వుకొందును. మేక గ్రుడ్లప్పగించుకొని గుండ్రని తిన్నెమీద మొదట వచ్చి నిలుచుకొనును. దాని దగ్గర పులిని కూర్చొనబెట్టుటకు రింగుమాస్టరు పడని కష్టములు పడును. చాలా లాఠీ దెబ్బల శబ్దము విన్నతరువాత పులి ఒక విధముగా మేక దగ్గరికి వచ్చును. పులి మేకను చూసి భయపడునా? లేక మేక చూపులకా? ఇది నా బాల్యదశలోని ప్రశ్న. పులియే మేకనుచూసి భయపడునని నా దీనమైన మనసు అనుకొనును. ఇప్పుడు అది తలచుకొని నవ్వుకొందును. లోలోపల నవ్వుకొందును. సర్కసు బఫూను చేతి కర్రతో ఆ ఆవరణములో అట్టహాసము చేయుచున్నపుడు ఇతడే ఊరికి మార్గదర్శియనికూడా లేత మనసుకు తోచును. అయినచో ఒకనాటి ఆటకొరకు మీసములను అతికించుకొను వేషధారియే ఇతడని వయసు పెరిగినకొలది తెలిసికొందుము. ఇదికూడా ఇంకనూ తెలిసికొనని వారు దేశములో ఉన్నారు! ఒకవేళ వారికి వయసు చాలదా? ఏమో! ఎలా ఉన్ననూ, ఇప్పుడు వారిని చూసి నవ్వుచున్నాను. బహిరంగముగా నవ్వుచున్నాను. నిజముగనే వయసే చాలా విషయములను బోధించును. లేనిచో "మంచి", "చెడు", "వివేకము""నమ్మకము" వీనియొక్క అర్థమును తెలియచేసినది ఎవరు? కళ అంతులేనిది. మానవుని ఆయువు పెయ్యేండ్లయినచో అతని వయసే సర్వమును నేర్పించును. కాని అతని ఆయువు నూరేళ్ల మాత్రమే. దానిలో సగము నిద్రకే సరిపోవును. మిగిలినది అశాశ్వతము! కావున బ్రతికినంతకాలము ఎంత నేర్చుకొన గలమో అంతే యిచ్చి పెట్టియున్నాము. ఈ జన్మయొక్క సార్థకత అంతే!

S. SHANMUGASUNDARAM

ఆంగ్ల భాషాబోధక సంస్థ,
17, మొదటి మెయిన్‌రోడ్డు, లేక్ ఏరియా,
నుంగంబాకం, మదరాసు-600 034
(వళ్లువరుకోటము ప్రక్కన)